# సిద్ధిపురి కథలు

(కథా సంపుటి)

## ఐతా చంద్రయ్య




జాతీయ సాహిత్య పరిషత్తు
సిద్ధిపేట.

పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వారి
ఆర్థిక సహాయంతో ముద్రితము

# సిద్ధిపురి కథలు

(కథా సంపుటి)

## ఐతా చంద్రయ్య





జాతీయ సాహిత్య పరిషత్తు

సిద్ధిపేట.

పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వారి

ఆర్థిక సహాయంతో ముద్రితము

సిద్ధిపురి కథలు - ఐతా చంద్రయ్య

జాతీయ సాహిత్య పరిషత్తు - సిద్ధిపేట శాఖ

99వ ప్రకాశనము.

ప్రతులు : 1000

ప్రథమ ముద్రణ - 2001

**వెల : రూ 60/-**

ముఖ చిత్రం : **గోపి**

-: ప్రతులకు :-

**✳ ఐతా లింగమూర్తి S/o.ఐతా చంద్రయ్య**

4-4-11 శేర్‌పురా, సిద్ధిపేట - 502 103.

ఫోన్ : 08457 - 20379.

**✳ విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌజ్**

4-1-435 బాంక్ స్ట్రీట్, హైదరాబాద్ - 500 001.

**✳ సాహిత్య నికేతన్**

బర్కత్‌పురా, హైదరాబాద్ - 500 027.

**✳ నవయుగ బుక్ డిస్ట్రిబ్యూటర్స్**

సుల్తాన్ బజార్, హైదరాబాద్ - 500 095.

ముద్రణ ఫోన్ : 25753

**స్వామి ఆఫ్‌సెట్ ప్రింటర్స్**

గాంధీచౌక్, సిద్ధిపేట - 502 103.

డి.టి.పి. : ఆర్.కె. గ్రాఫిక్స్,

గాంధీచౌక్, సిద్ధిపేట - 502 103. ఫోన్ : 24803.

ఆచార్య ఎల్లూరి శివారెడ్డి
తెలుగు శాఖాధ్యక్షులు
ఉస్మానియా విశ్వ విద్యాలయం,
హైద్రాబాద్.
తేది : 28-9-2001

# "ప్రసిద్ధి" పురి కథలు

కొన్నేళ్లుగా చక్కని కథలు రాస్తూ ఎంతో మంది పాఠకుల అభిమానాన్ని ఆర్జించుకున్న కథానికా రచయిత శ్రీ ఐతా చంద్రయ్య గారు. ఆయన రచనల్లో ఇది చిన్నదే అయినా గణనీయమైంది. అభిరుచి ప్రధానమైన రచన ఈ సిద్ధిపురి కథలు.

ఇది సాహితీ యుగంలో కథానికా కాలం. కవిత్వం సిద్ధాంతాల హోరులో సహృదయ పాఠకులకు దూరమవుతున్నది. నవల పఠనానికి జనానికి సమయం చిక్కడం లేదు. తక్కిన ప్రక్రియలు జనానికి అందుబాటులో ఉండవు. అదీగాక టీ.వి. అందరి కళ్లను అతికించుకుంది. కాస్త అభిమానంగా చదవటానికి, ఆత్మలోతు తెలుసుకోవటానికి ఇప్పుడు కథానికా సరియైన సాధనం. ఐతా వారు అందుకే కథానికా రచనవైపు మొగ్గుచూపారు.

శ్రీ ఐతా చంద్రయ్య గారు చిన్న చిన్న కథల్ని పెద్ద మనసుతో రాశారు. నేటి సగటు యువకుడు ఎలా కలల్లో తేలిపోయి ఆరాటం పాలవుతాడో మొదటి కథ స్వప్నసమీరం చెబుతుంది. ప్రేమనందం కలలన్నీ యువకుల స్వప్నాలకు

ప్రతీకలు. అల్లకల్లోలమయిన కాశ్మీర్ లో జరుగుతున్న చరిత్ర కు అద్దం పట్టిన కథ - సిందూరం. ఇది గుండెల్ని తడి చేస్తుంది. జేబుదొంగ కథ చివరిదాకా మనను నిశ్శబ్దంలో ఉంచి ఠపీమని పేలుతుంది. పోలీసులో కన్నా దొంగలో చాతుర్యం ఎంత ఎక్కువో చూపెడుతుంది. సైరన్ కథలో యువతీయువకుల మధ్య ఉండేదీ, ఉండవలసింది ప్రేమే కాదనీ, స్వచ్ఛ మైన స్నేహం కూడా ఉంటుందని చిత్రించారు కథా రచయిత. ఇలాంటి భావాలన్నీ సంఘంలో పెంపొందింప వలసిన అవసరం ఉందనీ వారి సూచన. కథలన్నీ అలాగా సాగిపోతాయి - మెరపులా మెరిసి మూగబోతాయి. అదే ఐతావారి చమక్కు.

శ్రీ చంద్రయ్యగారు కవిగా, కథారచయితగా ప్రసిద్ధులు. పాఠకుల గుండెలో పదిలంగా ఉన్నవారు. వారి కథల్లోని నవ్యతను, జాతీయ దృక్పథాన్ని , ప్రగతిశీల లక్షణాన్ని గమనించి అభిమానించే అభిమానులున్నారు. అంతకన్నా కావలసింది ఏముంది. ఈ “ సిద్ధిపురి కథలు” ప్రసిద్ధి పురి కథలు అవుతాయని నా ఆశ......

— ఆచార్య ఎల్లూరి శివారెడ్డి

# హృదయావిష్కారం

సిద్ధిపురి అంటే... సిద్ధిపేట. సిద్ధిపేట అసలు పేరు సిద్ధిపురి. నవనాథ సిద్ధులలో ఒకరిచట సిద్ధి పొందగా ఆ పేరుతోనే సిద్ధిపురి వెలిసిందని ప్రతీతి. అలనాడు కాకతీయులు నిర్మించిన భోగేశ్వరాలయం, అధునికుల కనుసన్నలలో రూపుదిద్దుకుని సర్వాంగ సుందరముగా వెలసిన కోటిలింగేశ్వరాలయం ... దర్శనీయ స్థలాలు.

వర్తక, వాణిజ్య, సాహితీ, సాంస్కృతిక, రాజకీయ రంగాలలో తెలంగాణాకే తలమానికమైన ఈ సిద్ధిపురి నేడు తెలుగుతల్లి కీర్తి కిరీటములో కలికితురాయి.

తెలుగు కళాకాంతులను విశ్వమంతా వెదజల్లుతున్న చిత్రకారుడు డా॥ కాపురాజయ్య, బాతిక్ బ్రహ్మ శ్రీ యాసాల బాలయ్య, కవి కోకిల డా॥ వేముగంటి నరసింహాచార్యులు, పేరిణి నాట్య ప్రవీణ, నృత్య కళావతంస శ్రీ రమేష్, సంచలన రాజకీయ నాయకమణి శ్రీ కల్వకుంట చంద్రశేఖర్‌రావ్ గారలు ఈ గడ్డబిడ్డలే.

సమకాలీన సమాజానికి సాహిత్యం దర్పణం కదా! సాహితీ ప్రక్రియల్లో అధిక జనాదరణ పొందిన తెలుగు కథ నేడు అంతర్జాతీయ స్థాయినందుకుంది. శిల్పములో, సంఘటనల చిత్రీకరణలో సరికొత్త మెరుపులు సంతరించుకుని పాఠకలోకాన్ని అలరిస్తుంది. కథా ప్రక్రియ ద్వారానే సిద్ధిపేట సొబగులను ప్రపంచానికి తెలియజేయాలనే ఆకాంక్షతో సిద్ధిపురి కథల రచన సాగింది. శ్రీ సత్యం శంకరమంచి గారి అమరావతి కథలు అందించిన స్ఫూర్తితో కథల్లోని సంఘటనలన్నీ సిద్ధిపేట పట్టణములో జరిగినట్లుగా ఊహించాను.

ఇందులోని కొన్ని కథలు అమృత్ కిరణ్ పత్రికలో సీరియల్‌గా, మరికొన్ని వివిధ పత్రికలలో చోటుచేసుకున్నాయి. ఆ పత్రికాధిపతులందరికీ నా ధన్యవాదాలు.

ఈ కథలను సంపుటీకరించిందేకు మొదట వెన్నుతట్టి ప్రోత్సహించిన బాల్యస్నేహితులు, ప్రముఖ సంఘ సేవకులు డా॥ నరేష్‌బాబు, డా॥ జి. మల్లయ్య (గజ్వేల్) గారల అదరాభిమానాలు మరువరానివి. వారితోపాటు అర్థికంగా సహకరించిన వదాన్యులకు కృతజ్ఞతలు.

హార్థిక ప్రోత్సాహ మందించిన మాననీయ ఆచార్యకసిరెడ్డి వెంకటరెడ్డి, ఆచార్య ఎల్లూరి శివారెడ్డి, శ్రీ కె.వి. రమణ,(ఐ.ఏ.యస్) గారలకు నమోవాకములు.

పుస్తక ప్రచురణకు అర్థిక సహాయ మందించిన పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయము వారికి, ముఖ చిత్రం వేసిచ్చిన ప్రముఖ చిత్రకారులు శ్రీ గోపి గారలకు ప్రత్యేక ధన్యవాదములు. మా జా.సా.ప. మిత్రులకు మరెన్నో కృతజ్ఞతలు.

— ఐతా చంద్రయ్య

సిద్ధిపేట

2-10-2001

# సిద్ధిపురి కథాక్రమము

## ముద్రణ సహాయ మందించిన వదాన్యులు

1. డా॥ ఏ. నరేశ్‌బాబు (నరేశ్ హాస్పిటల్-పాలీక్లినిక్) గజ్వేల్
2. డా॥ జి. మల్లయ్య (మల్లికార్జున నర్సింగ్ హోం) గజ్వేల్.
3. డా. ఓ. యస్. స్వామి (వి.వి.యస్. దంతవైద్యశాల) సిద్ధిపేట.
4. శ్రీ ఏ.వి. భాస్కర్‌రావు (అడ్వొకేట్) గజ్వేల్.
5. శ్రీ ఓ. గోపాలకిషన్ రావు, పెద్దగుండవెల్లి.
6. శ్రీ నేతి నర్సయ్య (అధ్యక్షులు- మెదకుజిల్లా ఆర్యవైశ్య సంఘం) గజ్వేల్.
7. శ్రీ ఇరెబొందుల అంజయ్య, గజ్వేల్.

## ఆశంస

సిద్ధిపేట పట్టణములోని సంఘటన లూహించి కథలుగా వెలువరించిన శ్రీ ఐతా చంద్రయ్య గారి "సిద్ధిపురి కథలు" బహుళ ప్రాచుర్యమైనవి. వాటిని ఓ కథాసంపుటిగా అచ్చువేసి తెలుగు పాఠకలోకానికి మా సంస్థ 99వ పుస్తకముగా సమర్పిస్తున్నాము. విజ్ఞులు, రసజ్ఞులైన పాఠకుల స్పందన నాశిస్తూ......

భవదీయ

**అయితా బాలరాజేశం**

ప్రధాన కార్యదర్శి

జి.సా.ప. సిద్ధిపేట - 502 103.

# స్వప్న సమీరం

కాకతీయ కళాత్మకతకు, దైవభక్తికి ప్రతీకగా నిల్చింది భోగేశ్వరాలయం. ఆలయం మంటపం చుట్టూ పలు భంగిమల్లో చెక్కిన సుందరాంగుల ఆకృతులు శిల్పాలుగా నిల్చాయి. చూపరులనిట్టే ఆకట్టుకుంటాయవి. ఆ బోగేశ్వరాలయ ప్రాంగణములో సినిమా షూటింగ్ జరుగబోతుంది. ఆ వేడుకను కళ్లారా చూచి మనసారా ఆనందించేందుకొస్తున్న తండోపతండాలైన జనాల్లో ప్రేమానందం మిత్రబృందం నడుస్తుంది. మిత్రులవైపు కొత్తగా చూచాడు ప్రేమానందం... విన్నారా ! అన్నట్టుగా "ఏది ఏమైనా సరే నేనో సిన్మా యాక్టర్నై తీరుతా!" అన్నాడు మరోసారి.

బ్రహ్మాండమైన జోకు విన్నట్టు పగలబడి నవ్వారొక్కసారే. పిచ్చోడిముందు పిల్లకాయల్లా కేకవేశారు మిత్రులు. "కొయ్యకురా కోతలు!" భుజం చరిచాడు ధన్‌రాజ్.

"నాలాగ పాటలు రాసినోళ్లంతా సిన్మా కవులు కాలేరు. మన రవి గాడిలా ఇంజక్షనివ్వగలిగినోళ్లంతా డాక్టర్లు కాలేరు. నీలాగ నాటకాల్లో వేషాలేసి నోళ్లంతా సిన్మాయాక్టర్లు కాలేరు. దానికి అదృష్టం, అవకాశం కలిసి రావాలి నాయానా!" పసలేని పిటిషన్ను డిస్మిస్ చేసిన జడ్జిలా కొట్టిపారేశాడు శశికాంత్.

"మనిషి ఆశాజీవి. కాని ఆకాశానికి నిచ్చెన్లు వెయ్యడం అవివేకం. మరట్లాగే అంటుండండి. నేను మాత్రం...." ఇంకేదో అనబోతున్న ప్రేమానందం నోరు అరచేత్తో మూసేసాడు దయానంద్ తన అరచేత్తో.

"నీ బొంద! ఉద్యోగాల్లో సెటిలయ్యాం. పెళ్లిళ్లై పోయినై. పిచ్చిపిచ్చి ఊహలు మానేసి ముందుకు నడవండి. ఇలాగే పెళ్లి నడక నడిస్తే అక్కడ షూటింగ్ షురువైపోతుంది."

"పెళ్లైతే మాత్రం... పట్టుదలలో పట్టు సడలలేదుగదా! పెళ్లయ్యాక సిన్మాయాక్టరైనోడే లేడా?"

ధన్‌రాజ్‌కు చిర్రెత్తింది.

"ఒరేయ్! ఎక్కువగా మాట్లాడ్తే నీ పేరు ప్రేమానందం నుండి దోమానందంగా మారిపోతుంది. పక్కబొక్కలు జాగ్రత్త!" పళ్లు పటపటలాడినై. ప్రేమానందం నోరు మూతపడింది. చూపులు మాత్రం... నువు చూస్తూనే ఉండు నేనో సిన్మా హీరోనై తీరుతా.. నన్నట్టుగున్నాయి.

ఊరి జనాలంతా భోగేశ్వరాలయం చుట్టూ విరగబడ్డారు. ఇసుకవేస్తే రాలనంత జన సందోహం. అరగంటసేపు సమిష్టి భజబలం ప్రదర్శించి ప్రహరీ గోడెక్కి కూచోగల్లింది ప్రేమానందం మిత్రబృందం. బఠానీలు కొని నమల్తున్నారు. ఓపక్క పోలీసు లాఠీలు గాల్లోకి లేస్తున్నాయి. మరోపక్క జనాల కుమ్ములాటలు, అరుపులు.. శివరాత్రినాటి కొమురవెల్లి జాతరలాగుంది షూటింగ్ స్పాట్.

బ్యూటీ క్వీన్ లవంగితో మేటి హీరో సుగుణాకర్‌ల మీద యుగళగీతం షూటింగట. సినిమా కంపెని వర్కర్లు చకచకా ఏర్పాట్లు చేస్తున్నారు. షూటింగ్ ఎప్పుడు ప్రారంభమౌతుందాని ఒళ్ళంతా కళ్లు జేసుకుని చూస్తున్నారంతా. కుడుకుల కుండలోంచి గసం గింజ రాలినట్టుగా గుంపులోంచి బయటికొచ్చాడో సాదామనిషి. కంగారుగా ఉన్నాడు. ఎవరికోసమో వెతుకుతున్నాడు.

"ప్రేమానంధ గారెవరండీ?. అడిగాడు ప్రేమానందాన్నే ప్రేమానందం రవి వైపు చూశాడు ఈ గొట్టంగాడెవఁడ్రా?

"అన్నట్టు పోవోయ్ ఫో! మా వాణ్ని దింపి నువ్వుకూచుందామనుకున్నావేమో... ఆ పప్పులు

మాదగ్గరుడకవు ఫో! ఝాడించి పారేశాడు రవి. బుర్రగోక్కున్నాడా మనిషి రెండు చెతుల్తో "కాదండీ.. నేనూ... నేను...."

"నువ్వెవడివైతే మాకేం గానీ వెళ్లిరా నాన్నా!" నాగరాజు డైలాగు గొల్లున నవ్వారంతా. ఆ మనిషిలోకంగారెక్కువైంది.

"ప్లీజ్ చెప్పండి.. నేనీ సిన్మా అసిస్టెంటు డైరెక్టర్ని."

"ఐతే మాత్రం మా ప్రేమానందాన్ని గోడ దింపి తీరాలా?" ప్రేమానందాన్ని గట్టిగా పట్టుకున్నాడు రవి.

"అయ్యో... అది కాదండీ హీరో సుగుణాకర్ బాత్రూంలో కాలుజారి పడిపోయాడు. కాలు విరిగింది హైద్రాబాదు తీసుకెళ్లారు. ఈ ఊళ్లో ప్రేమానందమనే ఫేమస్ స్టేజీ యాక్టరున్నారటా...." అంజనేయుడు లంకలోకి లంఘించినట్టు గోడ కూకేశాడు ప్రేమానందం.

"నేనేనండీ. స్టేజీ యాక్టర్ ప్రేమానందాన్ని నేనే!"

"హమ్మయ్య... మీరోసారి నాతో రండి" చెయ్యి పట్టుకు లాక్కెళ్లాడు స్నేహితులవైపు చూసేందుగ్గూగా అవకాశమివ్వలేదు.

"చూడండి ప్రేమానందం గారూ!" డైరెక్టర్... సాక్షాత్తు సిన్మా డైరెక్టర్ చేతులు జోడించాడు. "ఈ సినిమాలో ఇదే మొదటి షూటింగ్. హీరో సుగుణాకర్ గారి కాలు విరిగింది. హైద్రాబాద్ హాస్పిటల్‌కు పంపించాం. అతనిప్పుడప్పుడే పంజెయ్యలేడు. అతని బదులుగా ఈ సినిమాలో మిమ్ముల్ని హీరోగా వేసుకుంటున్నాం. మీ నటనా చాతుర్యాన్ని ప్రదర్శించి మీకూ, మాకు పేరొచ్చేలా చూడండి".

"ఈ షూటింగ్‌కోసం ఇప్పటికే లక్షలు ఖర్చైంది. ఏర్పాట్లన్నీ పూర్తైనై. షూటింగిప్పుడు కాన్సిలైతే బొలెడంత నష్టం, మీరెన్నో నాటకాల్లో వేసి బోలెడన్ని బహుమతులు గెల్చుకున్నారని విన్నాం. ప్లీజ్! ఈ పాత్ర ఒప్పుకోండి. రెమ్యునరేషన్ సుగుణాకర్ కంటే ఏ మాత్రం తగ్గదు." అగ్రిమెంటు ముందుంచాడు నిర్మాత. వెతకబోయిన తీగ కాలుగు చుట్టుకున్నట్టుంది ఓఫ్ .... అదృష్టమంటే నాదే...ప్రేమానందం ఎదలో

ఆనందకెరటాలెగసిపడిన్నె. బయట పడితే చులకనైపోవచ్చు. బింకం ఏ మాత్రం తగ్గొద్దాయె.

"సరే... మీరంతగా అంటున్నారు కాబట్టి ఒప్పేసు కుంటున్నాను" అగ్రిమెంటు మీద సంతకం చేశాడు.

షూటింగ్ సన్నివేశం, దాని నేపథ్యం వివరించాడు డైరెక్టర్. డాన్స్ డైరెక్టర్ పాట మీద స్టెప్పులేసి చూపించాడు. హీరోయిన్ లవంగితో రిహార్సలైంది. నవ్వుల పువ్వులు రాలిపడిన్నె.

"భేష్‌ప్రేమానందం గారు!" డైరెక్టర్ తృప్తిగా ఊపిరి పీల్చుకున్నాడు..

ఒకే ఒక పాట... లవంగి, ప్రేమానందం ల మీద యువళగీతం. షూటింగ్ సాయంత్రం దాకా సాగింది. ఉరుకుల, పరుగులు, కౌగిలింతలు, ముద్దులు... పాట నిండా అవే. ప్రేమానందం మిత్రమండలి సంతోషానికధుల్లేవు. చప్పట్లల వర్షం కురిసింది. "మనవాడు అసాధ్యుడేరా" అనుకున్నారప్పుడు.

సంధ్యా సమయం చీకటి తెరలు దిగుతున్నై. సినిమా బృందం హోటల్ అమరావతి చేరుకుంది. భోజనాలప్పుడు లవంగి ప్రేమానందం పక్కనే కూచుంది. భోజనం మధ్యలో చిరునవ్వులు, చిలిపి కబుర్లు చెప్తూనే పోతుంది భోజనాలయాక.

"ప్రేమానందం గారు నా రూంలో అడ్జెస్టైపోతారండి" నిర్మాతతో చెప్పేసింది లవంగి. కాటుక కళ్లను గమ్మత్తుగా తిప్పేస్తూ ప్రేమానందాన్ని మేడమీద తన గదిలోకి తీసుకెళ్లింది. సోఫామీద కూచోబెట్టింది. ముందుకు వంగి కళ్లతో కళ్లు కలిపింది. ట్యూబులైటు వెలుతురు లవంగి చెక్కిళ్లమీద పరావర్తనం చెంది ప్రేమానందం పెదాలమీద దోబూచులాడుతుంది.

"ఏమిటలా చూస్తున్నారు?" అడిగాడు ఏం చేయ్యాలో తోచక. "
"మీరింత గొప్ప యాక్టరనుకోలేదండి! ఏమా స్టెప్పులూ, ఏమా భంగిమలు, అన్నింటిని మించిన ఆ చొరవా... మీ ముందు సీనియర్ హీరోలంతా బలాదూరే!" గబుక్కున చెంపలందుకుని తన చెంపలకద్దుకుంది.వెచ్చగా హాయిగా, ఏదోలా ఉంది. కొత్త ఉత్సాహం కితకితలు పెడుతూంది.

"నిజంగానా?" లేచి నిల్చున్నాడు. కాళ్లు ముందుకెల్లానంటున్నాయి కాని ఏదో శక్తివెనక్కు లాగుతుంది"

నన్ను ప్రోత్సహించాలని అలా అన్నారు గదూ!" భుజాలందుకోబోయి చేతులు వెనక్కులాక్కున్నాడు.

"కానే కాదు" కిలకిలా నవ్వింది. ఆ నవ్వులో ఎన్నో అర్థాలున్నాయి. "సినీ ఫీల్డులో మొహమాటం కుదరదండీ బాబూ!.... మీరిలా రండి" అంటూ మెడచుట్టూ చేతులేసి బెడ్రూంలోకి నడిపించుకెళ్లింది.

ఏ.సి. రూం. మెత్తని పరుపులు... సుతిమెత్తని లవంగి చేతులు ఒళ్లంతా తడుముతున్నాయి.

ఐతే సిన్మా తారల గురించి విన్నదంతా నిజమేనన్న మాట. ఇంకా మల్లగుల్లా లెందుకూ?నరాల్లో హుషారెక్కింది. మొహం విచ్చుకుంది. నడుమ్మీద చెయ్యేసి గుండెలకు హత్తుకున్నాడు.

"ఆ... అలా ఉండాలి... అదో కిటికిలోంచి చూడండి... ఆ చందమామ ఏమంటుందో!" భూజల మీద చేతులేసి కిటికీ దాకా తీసుకెళ్లింది.

సిద్ధిపురి అందాలు స్పష్టంగా కన్పిస్తున్నాయి. భోగేశ్వరాలయ శిఖరమ్మీది లైటు వెలుగులు. విద్యుద్దీపాలతో అలంకరించిన లాల్‌కమాన్. బంగాళాల మీద వెన్నెలలు పరుస్తూ నింగిలో ప్రయాణం చేస్తున్న చందమామ....

“ఇచ్చా చూస్తుంటే ఏమొస్తుందీ?” ఒక చేత్తో ఒత్తుగా పెరిగిన మీసం కట్టును తడుముతూ మరో చేత్తో పెగ్గుపెదాల కందిందింది. మత్తుగా, గమ్మత్తుగా ఉంది. రంగురంగుల దృశ్యాలు కళ్లముందు కదులున్నాయి. ప్రేమానందం వెన్నుపూసలో విద్యుత్తు ప్రవహిస్తోంది. ఉత్సాహం.... అత్యుత్సాహం... ఆరాటం... ఏదో ఆరాటం.... ఆలస్యం అమృతం విషమన్నారు గదా!

“లవ్లీ లవంగీ... కమాన్ డియర్!” చెయ్యి బట్టి లాగాడు. మల్లెపూవులా మంచమ్మీద వాలిపోయింది ఇద్దరి కళ్లనిండా కైపు. ఒంటినిండా పులకింతలు.

“వెరీగూడ్ లవంగీ... థాంక్యూ!” అంటూ తానూ మంచమెక్కాడు. పెదాలు కలుసుకోబోతున్నాయి. “అబ్బ ఆశ!” కళ్లు సగం మూసి “అవ్వవ్వవ్వ....” నాలుకతో వెక్కిరించింది. మంచం దూకి కిటికీవైపు పరుగెత్తింది.

“నేను గూడా దూకగలను. నిన్ను పట్టుకోగలను లవంగీ!” గబుక్కున దూకేశాడు మంచమ్మీంచి. కాలు కలుక్కుమంది. మోకాలులో నొప్పి.

“అబ్బోనొప్పి” ... లేవరా లేదు. “వామ్మో నాకాలు.. నాకాలు లవంగీ...” ఇల్లు దదరిల్లింది.

కంటిరెప్పలు భళ్లున విచ్చుకున్నాయి.

“అయ్యయ్యో.... ఇదేమిటీ? మంచమ్మీంచి పడిపోయారేంటీ. మీకేమైందిదండీ?” లబోదిబోమంటూ పరుగెత్తుకొచ్చింది ప్రేమానంద భార్య.

“అయ్యో.... లవంగీ... లవంగీ...” భార్య మొహంలోకి చూస్తూ గొణుక్కుంటున్నాడు.

“లవంగం కోసం మాంచమ్మీంచి దూకెయ్యాలా? నన్నడితే నేనిద్దును గదండీ...”

"లవంగం కాదు మొద్దుమొహమా! లవంగి... నా సిన్మా హిరోయిన్ లవంగి... ఆ ఇదేమిటీ... ఇది... ఇది నిజం కాదా! కలనా?" చేతులు నేలమీద ఆనించి లేవబోయాడు. మోకాలులో గుండు సూదులు గుచ్చుకున్నంత నొప్పి. లేవరాలేదు.

"ఆదివారం... పట్టపగలు... మళ్లీ సిన్మాలో నటిస్తున్నట్టు దిక్కుమాటిన కలొచ్చిందా?" భార్యకళ్లల్లో కోపం గిరికీలు కొడ్తుంది. రెండు చేతుల్లో భర్త భుజాలు పట్టి లేపబోయింది. పంచప్రాణాలు పైకెగిరి పోయినై. హోటల్ అమరావతి పై అంతస్తునుండి జారి పాతాళలోకంలో పడిపోయినట్టుంది.

"అమ్మో... నా కాలు... నా కాలూ!" భార్య చేతుల్ని విసిరికొట్టి బోర్ మన్నాడు.

"అయ్యయ్యో ఎంత పనైందండీ!" భార్యగూడా బోర్మంది. గుండెలు బాదుకుంది.

పక్కపోర్షన్ల వాళ్లంతా హుటాహుటిన పరుగెత్తు కొచ్చారు. చుట్టూ మూగారు. సానుభూతి కురిపించారు. హాస్పిటల్లో ఎక్స్రేలు వగైరా పరీక్షలయ్యాక తెలిసింది కాలు విరిగిందని.

(ఆదివారం - ఆంధ్రభూమి - 24-3-1996.)



# ఒక చిన్న మాట...

"ఏమండోయ్ శ్రీవారూ.... ఒక చిన్నమాట" మనసంత వసంతకోయిలై పోయింది భర్తముందు భరతనాట్య మెయ్యాలనిపించిందేమో!

"చిన్నా చితక మాటెందుగ్గాని పెద్దమాటల మూటనే విప్పేసేయ్" పద్మారావు పెదాలమీద చిరునవ్వు చిందులేసింది. మంచమ్మీంచి గబుక్కున లేచి నడుమందుకున్నాడు.

"అబ్బా... ఉడుంపట్టు.... వదిలెయ్యండి! ప్లీజ్" సిగ్గులు పూసి బుగ్గలు ఎర్రబారినై.

"నేనిప్పుడే స్నానం చేసొచ్చానండీ!" "అలామొగలమై ఆర్నెల్లన్నా కాలేదు. అప్పుడే వదిలెయ్యాల్నా?" చెంపలందుకున్నాడు. ముద్దుల ముద్రలు పడిపోతున్నై.

"లేడికి లేచిందే పరుగన్నట్టు.... తెల్లారగానే సరససల్లాపాలా? పొద్దు బారెడెక్కినా పోకిరివేషాలు మానరా?" విడిపించుకుందామంటే మనసొప్పలేదు. కౌగిట్లో బందీ అయిపోయిది. "సిగ్గులేదూ!" కనురెప్పలు టపటపలాడినై.

"బోలెడుంది. పెళ్ళాం ముందు సిగ్గెందుకూ... బొగ్గు?"

"అయ్యో... మీ నాజూకు మీసాలు నా చెంపల్ని తాకితే నరాలు జివ్వుమంటున్నాయి తెల్సా!" కుంకుమ బొట్టు తళుక్కుమంది.

"నీఅందావ్నంతా చిదిమి దీపం బెట్టుకోవచ్చోయ్!"

"అందాలకేం గాని ... వదలండీ... ఆఫీసుకెళ్లరా ఈ రోజు? మన పెళ్ళై ఆర్నెల్లు దాటింది మహాప్రభో!"

"ఏందో వసంతా! పెళ్ళై ఆర్నెల్లైనా... నాకైతే ఆర్రోజులు కూడా కానట్టనిపిస్తుంది. చెక్కిన నీ చక్కని ముక్కు, దాన్ని కాపలా కాస్తున్న కాటుక కళ్లు... కొండపాకుతున్న కోడెనాగులా భుజమ్మీద జడా..."

"ఆహా! కవిత్యం గూడానా!" బలవంతంగా విడిపించుకుంది. కవిత్వం శృతిమించితే పైత్యం పతిదేవా! ముందు అటు వెళ్ళండి కళ్లతో బాత్రూంచూపించింది.

"నా పేరు పతిదేవ కాదు. పద్మారావు పూవుపుట్టగానే పరిమళిస్తుందన్నట్టు నేను పుట్టగానే సంగీత కచేరీ చేసిన్నటా! అదివిని డాక్టర్లూ, నర్సులూ ఈ లోకాన్నే మరిచి పోయిండ్రటా...."

"ఇంకానయుం... " కిలకిలా నవ్వింది. "ఈలోకాన్నే విడిచిపెట్టారనలేదు. పుట్టగానే కెవ్వుమని ఏడిస్తే హాస్పిటల్ స్టాఫంతా జడుసుకుని పారిపోయుంటారు..." పగలబడి నవ్వింది.

"అబ్బా... గుంటూరు గుమ్మవన్పించుకున్నావోయ్!" "మీరు మాత్రం సిద్ధిపేట చిన్నోడన్పించుకుంటున్నారు గదా... ముందు తెమలండీ...."

"సరేగాని.... ఏదో చిన్నమాటన్నావు గదా! చెప్పేయ్ అదేందో"
"ఆ.... చెప్పాలా! ... ఎందుకులెండి...!"

"వానరాని మేఘాలోలె ఎందుకట్లా వెనకా ముందాడ్తవ్. చెప్పేయ్."

"మరేంలేదు..." బుంగమూతి పెట్టి కొంటెగా చూసింది "ఈ రోజు గోంగూర పచ్చడి చేస్తానండీ. అందటే నాకెంతో...." చెక్కిలిమీద చిటికె పడింది. నరాలు స్వరాలు పలికినై.

"గోంగూరనా, గొంగడి బొంతనా! ఇయ్యాల్ల దొండకాయ ముద్దగాయ చెయ్. అవి నీ పెదాలలెక్క కమ్మగా..." నాలుగు పెదాలొకటై పోయినై.

"చాల్లెండి సంబడం!" భుజాలు పట్టి నెట్టేసింది. "బంగారం లాంటి గోంగూరకు నేను దూరం కావాల్సిందేనా? గోంగూరను తెలంగాణాలో ఎక్కువ తినరు కానీ... రుచంటే గోంగూర పచ్చడిదే... కారం కారం, పుల్లపుల్లగా కమ్మకమ్మగా... ఓసారి తిని చూడండి. నా సామిరంగా..."

"అసలు రుచంటే దొండకాయ ముద్దగాయదేనోయ్. కారం కారం, ఉప్పుప్పగా, కొంచెం పుల్లపుల్లగా....మూడు రుచుల త్రివేణీ సంగమం... మస్తుగుంటది గుంటూరు పిల్లా!" లొట్టలేశాడు.

"దాంతోపాటు బుద్ధిమాంద్యం! గూడా వస్తుంది. సిద్దిపేట చిన్నోడా!" చిరుకోపం చిర్రెత్తిందింది.

"ఎవడో బుద్ధిమందగించిన వాడనుంటాడామాట. అయినా ఈనెలలో దొండకాయను మూడుసార్లు మూడురకాలుగా వండానుగా!"

"మూడుసార్లు వండినా, ముప్పైసార్లు వండినా ఈరోజు దొండకాయ కూడ వండాల్సిందే. గోంగూర సంగతి గంగలో కలిపెయ్."

"ఐతే ఈ మొండి మొగుడికి నాతడాకా చూపించాల్సిందే." రోషంతో మొహం ఎర్రబారింది.

"కుదరదు ఈరోజు నేను గోంగూర పచ్చడి చెయ్యాల్సిందే. మీరు తినాల్సిందే మొండికేసింది.

"ఉహూ! దొండకాయనే...."

"అయ్యో..." కోపంగూడా వస్తుంది. దొండకాయ దండిగా తింటే మెదడు మొండికేస్తుందడీ; రుసరుస. బుసబుస.

"గోంగూరంటే నాకు కంగారు వసంతా!"

"దొండకాయంటే నాకు పరేషాన్ బాబూ!"

పద్మారావులో పట్టుదల పెరిగింది. ఆడదానికి లొంగిపోతే బతుకంతా అడవిపాలైపోతుంది... "అసలూ.. మొగుడంటే మోటకేసిన మొద్దనుకున్నావా?"

"కాదు. ముద్దుల పేళ్లాం ముచ్చట దీర్చే మొనగాడనుకున్నాను అయినా.. పెళ్లామంటే తమరేమనుకున్నారో" వసంతలక్ష్మిలాగున్న వసంత ముఖ పద్మం ముకుళించుకుపోయింది.

"బెల్లమనుకున్నా... కాని గోంగూరను గుర్తు చేయ్యకుమంటున్నా...."

"అదంటే నాకు ప్రాణం గదా!" ఆత్మాభిమానం హారతి కర్పూరమైపోతుంది. ఏమైనా సరే తెగించక తప్పదు...."

"ఏనాసరే... అది నాకొద్దు" బిగుసుకు పోయాడు.

నేను దేన్నైనా వదులుకుంటాను గానీ గోంగూరను వదులుకోను అది నా ఆరో ప్రాణం...." ఉక్రోషం ఉబికింది.

"నేను గూడా... ఏ కూరనైనా ఒప్పుకుంటాను కానీ గోంగూరంటే గొడ్డలందుకుంటా..."

"ఆడదంటే ఈయనగారికంత చులకనెందుకో! ఇప్పుడు ఒప్పుకుంటే ముందు ముందు తిప్పలు తప్పవు... ముక్కుకు ముగుదాడు వేసి తీరాలి... వాలకం గంభీరమైంది. "అంతేనా! నా కోరిక కొంగలెత్తుకుపోయిట్టేనా!.

"అదేమన్నా అమృతమా! పనికిరాని పంతానికి పొతున్నావు వసంతా! అసలూ... నువ్వంటే నాకెంత ఇదో... నీకు తెలీదా!".

" ఆహా! మాటలు మాణిక్యాలు చెతలు చెత్తకుండీలు. " ఏది ఏమైన సరే... ఈరోజు గోంగూర పచ్చడి చేసి తీరుతా..."

"ఎగాదిగా చూసింది... కళ్లల్లో కాంతి లేదు.

"అప్పుడు నీ చెంపలు గూడా పచ్చడై పోతై జెర.. జాగ్రత్త!"

"ఇదో చూడండీ!" దూరం జరిగి కుడికాలు నేలకు కొట్టింది. "చివరిసారిగా చేబుతున్నా.." రోషంతో గుండెలెగసి పడుతున్నై "గోంగూర వద్దంటే నన్ను వద్దన్నట్టే... ఆ..." అభిమానం అవమానం అతలాకుతలమై కన్నీరుగా కదలాడినై.

"ఆడదాని కన్నీళ్లకు కరిగిపోతే మొగుడు మోటకేసిన మొద్దైపోతాడేమో! ఇంతదాక వచ్చింతర్వాత తగ్గేది లేదు.

"అయినా సరే... గోంగూర వద్దు..." చూపుల్లోవేడి. "అదే వండేస్తా. ఏమౌతుందో చూస్తా.." మాటల్లో వాడి. మాటా మాటా పెరిగింది. పట్టుదల పట్టింపులు గట్టిగా ముడి పడిపోయినై తెగింపుదాకా వచ్చింది. వసంత సూట్‌కేసు సర్ధుకుంటూంది. పద్మారావు బాత్రూంలోకెళ్లి తిరిగొచ్చాడు.

"ఇంత చులకైపోయాక నేనీ ఇంట్లో ఇక్క క్షణం గూడా ఉండలేను..." సూటుకేసు అందుకుంది.

"ఉండకుంటే ఊరికిపో... తాటాకు చప్పుళ్లకు కుందేలు చెదరదు..."

"బెదిరింపు. అదిరింపు కాదు. ఇది నా ఆత్మాభిమానానికి సంబంధించిన సంగతి... వస్తా" కొంగుతో కళ్లద్దుకుంటూ గడప దాటింది. అసలేం జరిగిందనే సంగతి అరగంట తర్వాత గాని అంతుబట్టలేదు పద్మారావుకు.

* * * * * *

"బావా, బావోయ్... బావగారండీ... ఆహా! వంటింట్లో తంటాలు పడుతున్నారా!"

"బ్రేకుల్లేని బస్సోలె... ఎవడ్రా అది... వంటింట్ల దాకా... పళ్లూడ్తాయ్ గాడిదకొడకా...!" గ్యాసుపొయ్యి దగ్గర గరిట తిరిగింది.

"అయ్యయ్యో! అప్పుడే చూపు మందగించింది! గాడిద కొడుకు కాదు బావా! గణేశ్‌రావు సుపుత్రుణ్ని. నీ గారాల బామ్మర్దిని... భవానీ శంకరాన్ని బావాశ్రీ!"

"ఓహ్! నువ్వా! నీ పందిమొహం నాకు చూపించకూ!" పెళ్ళాం ఫరారైందని నేనేడుస్తుంటే వీడొకడు! కోపమొచ్చింది. గరిట గాల్లోకి లేచింది.

"నాది పందిమొహం కాదు పద్మారావు గారూ! నంది మొహం. అలా నరకాసురుడిలా ఎగబడే కంటే ఓ కళ్లజోడు కొనుక్కుంటే బావుంటుంది గదా! ..." గరిట లాక్కున్నాడు.

అన్నం పొంగిపోతుంది- పద్మారావు వంతంలా బామ్మర్దిమాటలు ఈటెల్లా గుచ్చుకుంటున్నై. "నేను.... నే...నే... నరకాసురుణ్నా? న....రు....కు...తా! తనకు సంభాళించుకోవడం కష్టమైపోయింది.

"సోరకాయలా, బీరకాయలా?" కిసుక్కుమన్నాడు. అన్నంలాగే పద్మారావు నరాల్లో రక్తం కుతకుతలాడ్తోంది. పరాభవమ్మును సయింతునా. పరాక్రమించక క్షమింతునా...!

"న్నీ నీ తలకాయను..." దమ్మొచ్చేసింది ఆయాసంతో కాస్సేపు మాట రాలేదు. ఓ నిముషం తర్వాత నిదానమైంది "ఎందుకొచ్చినవ్? నా ఇంటికి రమ్మని నీకేమన్నా పత్రిక పంపిన్నా?"

"పవిత్రమైన పనికి పత్రికెందుకు బావాశ్రీ? మా అక్క... పూవులాంటి మా వసంతక్కను పూలకారులో ఎక్కించి మీ ఇంట్లోదింపి మీ చేతుల్లో పెట్టాం..."

"చంచాగిరి చేస్తున్నావా?" అన్నం దింపేసి పాలు పెట్టేశాడు.

"ఛఛా... చచ్చీచెడి... బెజవాడ మీదుగా భాగ్యనగర్ దాటొస్తే... ఇదేనా మర్యాద? ఇదేనా నాగరకత? ఇదేనా ఓబావ తన బామ్మర్దికివ్వాల్సిన అతిథి సత్కారం. .. ఇదేనా మానవత? ఇదేనా..." అయాసమొచ్చి గొంతు తడారిపోయింది. కళ్లల్లో నీళ్లు తిరిగినై.

"కాదు బావా! మా వసంతక్క పరిస్థితి మాన్యులైన మా బావగార్కి... అనగా తమరికి చెబుదామనీ...."

ఓహో.... పశ్చాత్తాపం ప్రారంభమైందన్నమాట...''

"చాల్చాల్లేవోయ్.. ఆ ముద్దావతారం అక్కకు ఈ గద్దావతారం తమ్ముడు....'' అనిర్వచనీయమైన ఆనందం.

"అప్పుడు... మా అక్కను ముద్దమందారమన్నావు బావా!"

"అబ్బా నువ్విప్పుడు గోంగూర రాయబారాని కొచ్చినావా?''

"రాయబారం కాదు .... రాచకార్యం"

"అదికావు బామ్మర్దీ! నా ఇష్టమొచ్చిన కూడ వండుంటే."

"మీరలా మొండికేస్తే ఎలా బావా! ముందు నేను చెప్పేది..."

"వినను. నిన్నూ...'' పాలుపొంగి పొయ్యిమీద పడిపోయినై.

"అయ్యయ్యో .... పదిరూపాయల పాలు."

"ఇదసలూ.... వంటిల్లా వల్లకాడా! వసంతక్క లేని ఇల్లు ఇల్లెంతకుంట సంతలాగైపోయింది. కాఫీ లేని కప్పులాగై పోయావు బావా! నీ మాటలు ఉప్పులేని పప్పులాగున్నాయి బావా.... అయ్యయ్యో... నీకెంత కష్టమొచ్చింది బావా....

పద్మారావు బుర్రలో అనుమానం పురుగు తొలిచింది. కళ్లెత్తి ఇల్లంతా కలియజూశాడు. నిజమే... వసంత లేకపోతే ఇల్లు ఆకురాలు కాలంలో అడవిలాగై పోయింది. నవ్వాలో. ఏడ్వాలో అర్థంకాలేదు. కాని... ఇప్పుడు నవ్వే శరణ్యం. "ఆహ్హాహ్హా! నువ్వెంత అమాయకుడివోయ్ జవానీ శంకరం"

"నా పేరు జవానీ శంకరం కాదు..."

"కాపోతే దివానీ శంకరం..."

"అదిగూడా కాదు.. అయ్యో బావా..."

"ఏదో ఒకట్లే గానీ... ఇది మెగాటౌన్. పూటకో హోటల్లో పూటుగా భోంచేసి కాలుమీద కాలేసుక్కూచుంటున్నా. ఇయ్యాల ఆదివారం గదాని నిన్ననే వంటల పుస్తకం దెచ్చినా"

"అయ్యో, అక్కయ్యా - బావగారు నన్నేమీ చేప్పనివ్వడం లేదు. నీ పరిస్థితి ఎట్లా జెప్పలే... అయ్యో అక్కయ్యా నీ కాపురం మూడుపూవులారుకాయలనుకన్నాను గాని.... నువ్వెట్లున్నావని గూడా అడగడం లేదే అక్కయ్యా...'' కావాలనే దుఃఖం తోసుకొస్తుంది వస్తుంది.

అరెరే ... వసంతకేమైందో.... పద్మారావు గుండె గుప్పిట్లో కొచ్చింది కానీ .... ప్చ్... "మీ అక్కకేమైందోయ్! రోజుకు మూడుపూటలా తింటూ ఆరు సినిమాలు చూస్తుంది గదా!"

" కాదు.... కానే కాదు.... నేనెట్లా జెప్పలే అక్కా" వాల్యూం పెరిగింది.

వీడేదో దుర్వార్త మోసుకొచ్చినట్టుంది. వసంతకేమైందో ఏమో! భగవంతుడా... ఆమెను చల్లగా చూడు... "గట్లా నీళ్ల లేని బాయిల పడి నడ్డిరగ్గోట్టుకున్నట్టు మొత్తుకును డెందుకో! అసలు సంగతేందో చెప్పేడ్వొచ్చు గదా!."

"చెప్పాలా... సరే... అక్కడ మా వసంతక్క.... అయినా మా అక్క సంగతి మీకక్కరలేదేమో.. చెప్పిగూడా ఏం లాభం?"

"అయ్యయ్యో వసంతా... నీకేమైందో!" నవనాడుల్లో ఆవేశం అంగలేసింది. బామ్మర్దిని కొరికి పారెయ్యాలన్పిస్తుంది.

"ఓయ్ పిచ్చి శంకరయ్యా! సస్పెన్స్‌ల వెడితే నీ తలకాయ సవాలక్ష వక్కలైపోతది. నా వసంతనేం జేసింఠ్రో చెప్పు" గల్లా అందుకున్నాడు.

"మేమేం జెయ్యలేదు బావా! మా అక్కయ్యనే నిన్న మధ్యాహ్నం గోంగూర పచ్చడితో బోంచేసి వచ్చి వరండాలో ధామ్మని పడిపోయింది..."

పద్మారావు గుండెల్లో అణ్వాస్త్రం పేలింది. "ఆ... ఆ ... వసంత పడిపోయిందా! గొంగూర ఎక్కువై పైత్యం చేసిందా లేక... అయ్యో... మీరంతా ఏంజేస్తున్నట్టూ.... గాడిద పండ్లు తోముతున్నారా?"

"అంత అదృష్టం గూడానా.....!" అంటే.... వసంత... అమాంతం... అయ్యో దేవుడా! "అసలేమైందో చెప్పవోయ్ మొగుడా!"

"మా అమ్మ గుండెలు బాదుకుంది. నాన్నకు అయోమయం. నేనేమో అర్జంట్‌గా ఆటో తెచ్చా... వెంటనే హాస్పిటల్ కెళ్లాం...."

"వెరీగుడ్.. అక్కడేమైందో చెప్పు!"

నీ యవ్వ.... అసహనం ఆకాశాన్నంటుకుంది. "ఇంకో అరగంట దాకా అసలు సంగతి చెప్పవా?"

వెంటనే నీకు కబురు పెట్టుమన్నారు అమ్మా నాన్నలు...."

"అయ్యో వసంతా.... నీకీ లోకంలో... చిఛీ.... ఆ రిజల్ట్ జల్ది చెప్తవా లేక నీ పదహారు పండ్లు..."

"చెప్తున్నాను బావా! మా అక్క తల్లి కాబోతుందంటూ తమరు తండ్రి కాబోతున్నారటా...."

"ఓర్నియవ్వ!..." ఏనుగెక్కి ఊరేగుతున్నంత సంతోషమైంది. ఎంత ఖుష్ కబర్ చెప్పినవోయ్ శంకరయ్యా... పదా... ఇహ పదా" చక చకా డ్రెస్సు మార్చుకున్నాడు. ఖుషీగా ఈల వేశాడు... కాని మా వసంతక్కకు గోంగూరంటే ప్రాణం గదా!"

"నాకు మీ అక్కంటే ప్రాణం గదా! చూడు బామ్మర్థి గోంగూరంటే నాకూ ఇష్టవేం కానీ... ఆ రోజెందుకో.... పంతానికొచ్చినం.... పోనీలే... రోజూ గోంగూరనే తినుమందాం. పదా.... ముందు మీ అక్కను చూడాలి పదవోయ్.. కాఫీ టిఫీన్లు కూడా రైల్లోనే... పదా.. మీ అక్కతో ఓ చిన్నమాట చెప్పాల్సుంది పదా!."

(మూసీ - ప్రత్యేక సంచిక - నవంబర్, డిసెంబర్ 2000)



# ఆటోమేట్

సమయస్ఫూర్తి అంటే ఏమిటో శ్రీనివాసును చూసి నేర్చుకోవాల్సిందే. కాని ఏం లాభం? ఈ వ్యవహారంలో మాత్రం సంయమనమే శరణ్యమైంది. అయినా... సంయమనం కూడా సమయస్ఫూర్తిలో భాగమే గదా!

సావర్కర్ చౌరస్తాలో హుషారుగా నుంచున్నాడు. మనసు మాత్రం - తొలకరి చినుకుకోసం ఎదురుచూస్తున్న చకోరపక్షిలా, పద్మకోసం... ఆ పద్మాక్షిచూపుకోసం పరితపిస్తూంది. ఆ జవ్వని అవయవ సంపదను మనసారా గ్రోలాలని ఉవ్విళ్ళూరుతోంది.

ఆ సుందర వదన రోజూ శివాజీ చౌక్‌లో నవ్వుతూ బస్సు దిగుతుంది. పక్కనున్న సావర్కర్ చౌరస్తా దాకా నాజూగ్గా నడిచొస్తుంది. అరవిరిసిన ముఖారవిందం, అరచేతులంత కళ్ళు, చెవులకు ఉయ్యాల లూగుతున్న మకర కుందనాలు, సన్నని నడుము, నున్నని ఒళ్ళు.... చూడముచ్చటగా ఉంటుంది. ఒక్క మాటలో చెప్పాలంటే దివి నుండి భువికి దిగివచ్చిన దేవకన్యలాగుంటుంది.

సావర్కర్ చౌరస్తాలో ఆటో ఎక్కి, ఐదు కిలోమీటర్లు అరమరికలు లేకుండా ప్రయాణించి, ఫైర్‌స్టేషన్ వద్ద దిగిపోతుంది. అక్కడికి అతి దగ్గరలో ఉన్న ప్రాథమిక పాఠశాలలో పాఠాలు చెబుతుంది. శ్రీనివాసు కూడా అదే చౌరస్తాలో, ఆవిడ ఎక్కిన ఆటోలోనే ఎక్కేసి అదే ఫేర్‌స్టేషన్ వద్ద దిగిపోతాడు. ప్రాథమిక పాఠశాలకు

ఎదురుగా జూనియర్ కళాశాలలో జాలీగా లెక్చర్లిస్తుంటాడు. సాయంత్రం కూడా ఆవిడతోనే ఆటో ఎక్కి ఇదే సావర్కర్ చౌరస్తాలో దిగుతాడు. చూపులు కలిసిన శుభవేళా..... పాటను నెమరేసుకుంటూ విడిపోతాడు. కలలో ఆవిడ ఒడిలో ఒరిగిపోతుంటాడు.

పాఠాల పంతులమ్మ, లెక్చర్ల లెక్చరర్.... ఒక రంటే ఒకరికి ఏదో.... ఇది. ఆ ఇదికి నిర్వచనం చెప్పించుకోవాలని శ్రీనివాసు తంటాలు పడుతున్నాడు. మొదటి మూడ్రోజులు ఆటోలో కాకతాళీయంగా కలుసుకున్నారు. ఆ తర్వాత కావాలనే కలిసి పయనిస్తున్నారు. మొదటి రోజు ముఖ పరిశీలన, రెండో రోజే మో పెదాల రంగస్థలమ్మీద చిరునవ్వుల చిందులాట. మూడో రోజు పరిచయాలయ్యాక పిచ్చాపాటి కబుర్లు చెప్పుకున్నారు. ఆ తర్వాత అదే వరుస కొనసాగింది.

అదిగో... పద్మ దళాయతాక్షి... పద్మ వయ్యారంగా బస్సు దిగింది. శ్రీనివాసు గుండెల్లో తేనెజల్లు కురిసింది. అదేమిటీ.... రోజు ఒంటరిగా వచ్చేది, ఈరోజు మరో బురఖా లేడీ చేతిలో చెయ్యేసి జంటగా వస్తుందే! దోసిట్లోని దోరమామిడి వండు జారి పోతున్నట్టనిపించిది. పద్మను కళ్ళతో పలకరించాడు. పెదాలు కదలకుండా జవాబిచ్చి ఒళ్ళంతా గిలిగింతలు పెట్టింది. కమ్మగా నవ్వింది. అప్పుడే ఆటో వచ్చి నుంచుంది మొదట పద్మ, తర్వాత బురఖా బుర్రి, చివరగా శ్రీనివాసు ప్రవేశించారు. ఆటో ఝూమ్మంటూ బయులుదేరింది. శ్రీనివాసు చిలిపి చూపులు పద్మమీదనే కేంద్రీకృతమైనాయి.

"పానకంలో పుడకలా ఈవిడెవరూ!" వెనక నుండి అడిగాడు సైగలతో.

"ఈమె నా ఫ్రెండ్... రజియా!" ముందు నుండి పరిచయం చేసి సర్దుక్కూచుంది. పద్మ.

వెన్నెలాలికే పద్మ కళ్ళల్లో కళ్ళుగలిని నరదాగా మాట్లాడాలనుంది కాని - భగవంతుడికీ భక్తుడికీ మధ్యన

మాయాదేవిలా ఈ బురఖా ఒహటి.

ఆటో పరుగులు. చూపుల తచ్చాటలు ఆవిడ అంతరంగ తరంగాలను చదవాలనుంది. చూపులటువైపు మళ్ళాయి. బురుఖా అడ్డమొచ్చింది. ఆటో స్పీడందుకుంది. శ్రీనివాసు బుర్రలో సమయస్ఫూర్తి చెమక్కు... వెనుకపైపు నుండి మెల్లిగా కుడిచెయ్యి వీపుల మీదుగా లేచింది.

ఎడమ భజమ్మీదేదో పాకుతున్నట్టనిపించింది. పద్మకు. చూపులటు మళ్ళినై. శ్రీనివాసు వేళ్ళు భుజమ్మీద భరతనాట్యం చేస్తున్నే.

"అమ్మ దొంగా!" చెయ్యి లాగి పారేసింది. రజియా చెయ్యి పైకి లేచింది. శ్రీనివాసు చెంప ఛెళ్ళుమంది. తేలుకుట్టిన దొంగయాడు. విధి లేక చూపులు రోడ్డు మీదికి మళ్ళినై.

మనసు కుతకుతలాడ్తుంది. చెంపమీద చీమ పాకుతున్నాట్టుంది. కోపమొచ్చింది.

"ఛీ... చీమగ్గూడా లోకువయానా!" కసిగా తన చెంపను తానే వాయించుకున్నాడు. చెంపమీదుంది చీమ కాదు పద్మ చూపుడు వేలు.

రజియాక్కోపమొచ్చింది. పద్మ చెంపను కసిగా గిల్లింది,

"అబ్బా.... మోటు!" అంటూ కందిపోయిన చెంపను అరచేత్తో పట్టుకుంది పద్మ. మనసుల్లో మంటలు లేవకముందే ఫైర్‌స్టేషన్ ముందు ఆటో ఆగింది. ముగ్గురూ దిగి చెట్టుకిందికొచ్చారు. వాతావరణం హాయిగా ఉంది.

బురుఖా కిలుక్కున నవ్వింది. పద్మ పకపకా నవ్వింది.

ముద్దు గుమ్మల నవ్వుల తరగలకు పులకించిన కొమ్మలు మెప్పుకోలుగా తలలాడిస్తున్నై.

ఎరక్కపోయి ఇద్దరి మధ్య ఇరుక్కుపోయానేమిటి! ఇబ్బందిపడుతున్న శ్రీనివాసుకేం చెయ్యాలో అర్థం కాలేదు.

"మన డ్యూటీలకింకా సమయముంది గదా!" అనగలిగాడు - పెదాల మీద చిరునవ్వు అతికించుకుని.

"డ్యూటీకి టైముంది గాని... మీ బండారం బద్దలయ్యేందుకింకా సమయం లేదు..." గబుక్కున బురఖా తొలగించుకుంది. "మీరిద్దరూ తోడు దొంగల్రా!" రెండు చేతుల్తో చెరొకటి అంటించింది. డంగై పోవడం శ్రీనివాసు వంతైంది.

అరె రజియా... రజియా కాదు, రజని. తోడబుట్టి కూడా పెరిగిన అల్లరి చెల్లి రజని... మొహం ఇంద్ర ధనస్సైంది. ఇప్పుడెలా రియాక్టవాలో.... సమయస్ఫూర్తి చప్పబడింది. కైలాస పర్వాతాన్ని కళ్ళారా చూస్తున్నట్టు.

"నువ్వా రజనీ!" నోరెల్లబెట్టాడు. "చెల్లినీ, చెలినీ మార్చి మార్చి చూస్తున్నాడు.

"అవున్రా అన్నయ్యా.. నేనే! ఈ పద్మనయన పూర్తి పేరు పద్మావతి. నా క్లోజ్ ఫ్రేండ్... తెల్సా!" రజని కనుబొమ్మలెగిరిపడినై.

"ఆ.... అట్టానా!" మరింత ఆశ్చర్యం.

ఊ... ఈ ఆటోమేట్ గురించి ఏదేదో చెప్పి... ఆవిడ మనసులో నువ్వెలాగున్నావో కనుక్కొమ్మన్నావు గదా! ఇది కూడా తక్కువ తినలేదు. నీ గురించి చాంతాడంత చెప్పి నీ మనసులో దాని స్థాన మేమిటో కనుక్కోమ్మని బతిమాలింది. ఇద్దరిచేత బతిమాలించుకున్నాను. ఇప్పుడు తేల్చి పారేశాను...."

"ఏం తేల్చావే!" పద్మావతి కనుబొమ్మలు తుమ్మెదరెక్కల్లా టపపటపలాడినై.

"మీరిద్దరూ ఇద్దరేనని..."

"నీ మొహం. ఇద్దరు ఇద్దరు గాక ముగ్గురౌతారా?"

"అవుతారమ్మాయ్." పద్మ చెంపమీద చిటికేసింది రజని. తోడు దొంగలిద్దరు ఈయేడు ఒకటైపోతే వచ్చే యేటికి ముగ్గురైపోతారు. నలదమయంతుల్లా ప్రేమించుకున్నారు. నాది కేవలం హంస రాయబారం.

సిగ్గుల భారంతో పద్మావతి బుగ్గలు ఎరుపెక్కినై. ఆగలేక అక్కడే ఆమె చెయ్యందుకున్నాడు శ్రీనివాసు. చెట్టు మీంచి రాలిన పూవులా అతని గుండెల మీద వాలింది జవ్వని.

"ఆ.... ఆగంగాగండి...." చూపుడు వేలును పెదాల కానించుకుంది రజని.... "ఆటోమేట్స్ ఆటోమేటిగ్గా ఆలుమగలై

పోతున్నారు. గాని..... ఇది పబ్లిక్‌ప్లేస్. పడగ్గది కాదు.

"అమ్మ పిడుగా! సాయం చేస్తావని మాయంచేస్తున్నావా?" రజని కుడిచెవి అందుకున్నాడు శ్రీనివాసు.

"ఇతడు మీ అన్నయ్యని ఒక్కసారిగూడా చెప్పలేదు ఎడమచెవి అందుకుంది పద్మావతి.

"వామ్మో.... ఇద్దరి మధ్య ఇరుక్కుపోయాను." పద్మావతి ముక్కందుకుంది రజని.. నేను నీ అర్థమొగుణ్ని సుమా. చెప్పినట్టు వినకపోతే ముక్కూడబీకి మూలకేస్తా... ఖబడ్దార్! ముక్కు విడిచి జడ అందుకుంది.

"నడిబజారు పక్కన నవ్వుల పువ్వులు జలజలారాలిపడినై.

(ఆంధ్రజ్యోతి - వారపత్రిక - 22-10-1999)



# సిందూరం

"ఏ గంగలో నన్నా దుంకి చావనన్నా ఛస్తానుగాని ఆ చాయలోనికి నా గంగనిచ్చి పెండ్లి చెయ్యను. చెయ్యనంటే చేయ్యను..."

అమాయకుడనుకున్న వెంకయ్య అగ్గిమీద గుగ్గిలమై చిటపట లాడ్తుంటే అవాక్కయాను.

కలుపు గోలుగా మాట్లాడ్తాడు. పెళ్లిల్లు పేరంటాల్లో కమ్మని వంటలు చేసి పెడతాడు. కాయకష్టంతో కాలం వెల్లబుచ్చుతున్న మా పక్కింటి వెంకయ్య వంటల వెంకయ్యగా ఊరందరికి తెలుసు. నీతి నిజాయితీలను నమ్ముకున్న మనిషి ఆత్మను అమ్ముకోలేడుగదా! అందుకే నాలుగురాళ్లు వెనకేసుకోలేక పోయాడు. పాపం! మగ సంతానం లేనివాడు. గంగ, యమున, సరస్వతి... ముత్యాల్లాంటి ముగ్గురాడ పిల్లల్ని... ఉన్నంతలో ఏలోటూలేకుండా అల్లారు ముద్దుగా పెంచాడు. కన్నె పిల్లలు కల్యాణఘడియల కోసం ఎదిరి చూస్తూన్నారుగాని... కాసులు కూడలేదు. కట్నాల మార్కెట్లో వరుల ధరవరలు వరుసగా పెరిగి పోతున్న రోజులాయే. ముగ్గురు కూతుళ్ల మెడలో మూడుముళ్లు వేయించాలని ముప్పతిప్పలు పడ్తున్నాడు.

నాకేమో ఉద్యోగ బాధ్యతతో ఊపిరాడదు. ఆదివారం ... వారానికి దొక్కరోజే రిలీఫ్. అలస్యంగా నిద్రలేచాను. చాయ చప్పరిస్తూ వార్తా పత్రికలో మునిగిపోయాను. అప్పుడే... వెంకయ్య పాలికేకలేస్తూ వచ్చి సీమటపాకాయలా పేలిపోతాడనుకోలేదు.

"చాయలో డంటే... ఆ మొబైల్ టీ కొట్టు ... అదే.... ఓ భుజానికి ప్లాస్కులు మరోభుజానికి ప్లాస్టిక్ గ్లాసుల సంచీతో...

బజార్లో తిరిగి దుకాణాల్లో చాయలమ్ముతుంటాడు... అతడేనా?" అడిగాను.

"ఆ.... వాడే వానింటి మంగట్నే ఉన్నడుగదా! మొకం జూస్తె మర్యాదా పురుషోత్తమునోలున్నడు గాని... నా గంగ బతుకుతోని ఆడుకుంటున్నడు సారూ!..." కొంపలంటుకున్నట్టు గుండెలు బాదుకున్నాడు.

"అం...టే ఏంజేసిండు?" నా భార్య చాయ అందిస్తూ "కూచో అన్నా!" అంది. రెండు గుక్కల్లో చాయ కప్పుల ఖాళీచేశాడు. వేడిచాయ అవేశాన్ని అణిచేసినట్టుంది.

"ఇంకేం జెయ్యాలమ్మా! మా గంగ గూడా వాణ్నే పెండ్లిజేసుకుంట నంటున్నది లేకపోతే విషం దాగి ఛస్తదటా!... నుదురు కొట్టుకున్నాడు.

ఎంగ ఘాటు ప్రేమయో... కొంత లేటు వయసులో!... అనుకన్నాను.

"గంగ ఇప్పుడెక్కడుందన్నా!" ముక్కుమీద వేలేసుకుంది నాభార్య.

"మా ఇంట్లనే ఉందమ్మా!" కుర్చీలో కూచోబోయి అగిపోయాడు. అతని వింత ప్రవర్తన నాకుగిలింతలు పెట్టింది నవ్వాపుకున్నాను.

"అమాత్రానికే అంత పరేషానా?" ఎగాదిగా చూశాను. అతని కళ్ళు అందోళన, అవేదనతో నిండున్నాయి.

"పరేషాన్ గాక ఇంకేముంది సారూ? ఎంత చెప్పినా గంగ వినడం లేదు. వాళ్లమ్మ లెంపలు వాయించింది. అయినా ఆ కోన్‌కిస్కాగాడు ఎక్కడ పుట్టిండో... ఎట్లా పెరిగిండో! ఇల్లూ ముంగిలి లేనోనికి పిల్లనిస్తే... వాడు తల్లెముంత అమ్ముకుని తాగితందనానలాడి ఉడాయించుకపోతే దాని గతేంది బాబూ!" కల్లనీళ్ల పర్యంతమయాడు.

ముగ్గురాడ పిల్లల పెళ్లిళ్లు చేయలేక మూడు చెర్ల నీళ్లు దాగుతున్న వెంకయ్య నేనా ఇతడు! చిన్నమ్మాయి పెద్దమనిషై ఏడెనిమిదేండ్లైంది. ఏదో రకంగా ఓ గ్రహాన్ని వదిలించుకోవచ్చు గదా!

"చూడు వెంకయ్యా!" సముదాయింపుకుదిగాను". ఆ రమేష్... అదే.... ఆ మొబైల్ టీకొట్టు... మనూరికొచ్చి చాలా రోజులైంది. పిల్లాడైతే బతకనేర్చినోడు. బాగానే ఉన్నాడుగదా!"

రెండు చేతులు నెత్తిమీదుంచుకుని గబుక్కున కూచున్నాడు. అది కోపమో, తాపమో.. అర్థంకాలేదు. ఓ నిముషమాలాగే ఉండి...

"మీ బిడ్డయితే ఏంజేసేవారు సారూ?" సూటిగా అడిగేశాడు. ప్రశ్న అంతసూటిగా వస్తుందనుకోలేదు. ఆ ప్రశ్నాబాణం నా గుండెలకు సూటిగా తాకి తల్లడిల్లజేసింది.

అవును... నాకూతురే అయితే ఏంజేసేవాణ్ని? నాలో కలకలం బయలుదేరింది. బుర్రచించి ఆలోచించాను. చేతనైన సాయం చేస్తానన్నాను. అచాయలోని బతుకు బట్టబయలు చెయ్యాలి.

* * * *

మా పారుపల్లి వీధి వారికి పటాటోపం తక్కువ. పిల్లినడకలా సంసారాలు గుట్టుగా సాగిపోతుంటాయి. కష్టాలను కడుపులో దాచుకుంటారు. భ్రమలు పెంచుకోరు కాబట్టి భంగపాట్లుండవు.

వెంకయ్య నా వెంటున్నాడు. దర్జాగా రమేష్ ఇంట్లో కెళ్లాం. ఆదివారం బజారు బంద్ కాబట్టి రమేష్ గ్యాడా సెలవే. అభ్యంగన స్నానమాచరించిన ఆడపిల్లల్లా గది శుభ్రంగా ఉంది. పాలగిన్నె, ఫ్లాస్కులు కడిగేస్తున్నాడు. రమేష్.

"రండి రండి!" మర్యాదగా లేచినుంచున్నాడు.

ముందు మర్యాదచేసి ఆ తర్వాత మమ్మల్ని కడిగెయ్యడుగదా! కళ్లతో కర్చీలు చూపించాడు. నాలుగు ప్లాస్టిక్ కుర్చీల్లో రెండింటి నాక్రమించాము. రమేష్ ముఖకవళికల్లో చెప్పుకోదగ్గ మార్పుల్లేవు. సిగ్గు, బిడియం, భయం మచ్చుకైనాలేవు. అన్నీ కడిగి, తుడిచి, అందంగా సర్దేశాడు. తువ్వాలుతో చేతులు తుడుచుకుంటున్నాడు. మేము మొహాలు చూసుకున్నాం.

"కూచో రమేష్!" నాచూపు లతణ్ని ఆపాదమస్తకం తడుముతున్నాయి. నిమ్మపండు దేహఛాయ, చక్కని ముక్కు, చలాకి కళ్లు... కాశ్మీర్ ఆపిల్‌లాగున్నాడు. వయసు ముప్పైలోపే. ఫ్లాస్కులోంచి చాయవంచి మాకందించాడు.

" ఫరవాలేదండీ..." అంటూ నుంచున్నాడు. అతని చేతిలో గూడా చాయగ్లాసుంది.

"ఊహు! ముందు కూచో" అంటూ తృప్తిగా చాయ్ సివ్‌చేశాను. ఆహా! ఇది చాయనా లేక స్వర్గలోకంలో తయారైన సురాపానమా! వెంకయ్య మొహం విచిత్రంగా మారింది. అతనిలో కొపతాపాలు కొట్లాడు కుంటున్నాయెమో! చాయతాగు మని కళ్లతో సైగచేశాను. ఆచరించి కూచున్నాడు.

నాణ్యమైన చాయ నరాలవాడిని, వేడిని సమతూకం చేసింది.

"రమేష్! మనదేవూరు? అమ్మానాన్న లెవరు బాబూ!" ఎందుకైనా మంచిదని అనునయంగా అడిగాను.

"అదంతా మీకెందుకు?" అంటాడనుకున్నాను. కాని అలా అనలేదు. మేమెందుకొచ్చామో అతని కర్థమై పోయినట్టుంది. మొహంలో రంగులు మారాయి. అది భయమో, భక్తో అర్థంకాలేదు.

"చెప్పునాయనా !" వెంకయ్య అదుర్తా.

"ఏ ఊరంటే .... నేను పుట్టి పెరింగింది శ్రీనగర్లో...." వినగూడనిదేదో విన్నట్లు.... మాచూపుల్లోని వైచిత్రి అతన్నో బొమ్మగా మార్చేసింది.

"అంటే.... జమ్మూ కాశ్మీర్ రాజాధానేనా?" నా కనుబొమలెగిరినై

"అవును... అదే....."

"మరైతే నీకు తెలుగెట్లా వచ్చింది?" వెంకయ్య అదుర్తా ప్లస్ ఆసక్తి.

"చెప్తా వినండి" కుర్చీలో సర్దుక్కూచున్నాడు. రమేష్ చూపులు శూన్యంలోకి విస్తరించినై. మా నాన్న పుట్టింది ఈ ఊరు... అంటే ఈ సిద్దిపేటలోనే. చిన్నప్పుడే కన్నవాళ్లను పోగొట్టుకుని హైద్రాబాద్ చేరుకున్నాడట. మోజంజాహీ మార్కెట్లో ఓ హోల్‌సేల్ పండ్ల వ్యాపారి వద్ద గుమాస్తాగా చేరాడట. నీతి నిజాయితీలతో కష్టపడి పంజేస్తూ యజమానికి విశ్వాసపాత్రుడైనాడట. అప్పటివరకా యజమాని స్వయంగా శ్రీనగర్ వెళ్లి అపిల్‌పండ్లు, ఖరీదు చేసి హైద్రాబాద్‌కు తరలించేవాడట. లాభాలతో పాటు వ్యాపారం పెరిగింది.

తన ఏజెంట్‌గా మానాన్నను శ్రీనగర్లో ఉంచేశాడట. ఆ ధర్మాత్ముడే ఓ అనాథ తెలుగు అమ్మాయితో మానాన్న పెళ్లి హైద్రాబాద్‌లో జరిపించాడట. అందాల కాశ్మీర్లో మా అమ్మానాన్నలు కొంతకాలం హాయిగా ఉన్నారట. మా అన్నయ్య, నేను చెల్లి అక్కడే కళ్లు తెరిచాము. ప్రకృతి ఒడిలో పరవశించాము. అడుతూ పాడుతూ చదువులు సాగించాము. మా అన్నయ్యకు ప్రైవేట్ కంపెనీలో ఉద్యోగం దొరికింది అక్కడమ్మాయితోనే పెళ్లైంది.

బయట హిందీ, కాశ్మీరీ మాట్లాడినా ఇంట్లో తెలుగులోనే మాట్లాడుకునే వాళ్లం. మా అమ్మ అమృతమూర్తి, దయామయి. అమెనే మా చేత తెలుగు అక్షరాలు దిద్దించింది. పెద్దబాల శిక్ష తర్వాత రామాయణం భారత, భాగవతాలు తెలుగులో చదివించింది.

కాశ్మీర్లో హిందువులు మైనారిటీలు, ముస్లిం జనాబా పెద్దది. అయినా పాలూనీళ్లలా అంతా కలిసిమెలిసి ఉండేవాళ్లం. అక్కడ తెలుగువాళ్లు చాలా తక్కువ. పెళ్లిళ్లు పేరంటాల్లో కలిసి కులాసాగా గడిపేవాళ్లం తేనెలొలికే తెలుగుభాష గురించి, తెలుగు తేజముగురించి గొప్పగా చెప్పుకునే వాళ్లం. మనసులు విప్పి మాట్లాడుకునే వాళ్లం

"చిన్నతనములో మతమంటే ఏమిటో తెలీదు. రానురాను పాకిస్తాన్ ప్రభావం ఎక్కువైంది. పరిస్థితిలో మార్పు చోటుచేసుకుంది. మతమౌఢ్యం జడులువిప్పింది. హిందువుల మీద దాడులధికమైపోయినై. భయం గుప్పిట్లో బతకలేక ఎన్నో కుటుంబాలు తరలిపోయినై. మేము మాత్రం ధైర్యంగా ఉన్నాము. మేమే మా వదినకు తెలుగునేర్పాం.

మా బస్తీలో మూన్నాల్గు తప్ప మిగితావన్నీ ముస్లిం కుటుంబాలే. బస్తీలోని ముస్లిం మిత్రులతో కలిసి సినిమాలకు, బోటు షికార్లకు వెళ్లేవాళ్లం కాలేజికి కలిసివెళ్లేవాళ్లం. చెల్లికూడా అంతే. కాశ్మీర్ కన్యలతో సరదాగా గడిపేది.

సృష్టికర్త అందాలన్నింటినీ అక్కడే కుమ్మరించాడేమో. ఎటు చూసినా పూలతోటలు, జలజలపారే సెలయేళ్లు, పిల్లగాలి తరంగాలకు తలలూపుతూ కూనిరాగాలు దీసే కొమ్మారెమ్మలు... మూగవానిగ్గూడా సంగీతం నేర్పిస్తాయి. తటాకాలు, సరస్సుల మీద తేలి ఆడే పడవఇళ్లు, కళ్లు చెదిరే రంగుల హంగులు... స్వర్గాన్ని తలపిస్తాయి. మంచుకొండల మీద స్కేటింగ్ చేస్తుంటే కైలాసములో పరుగెడుతున్నట్టనిపిస్తుంది. అదొక తియ్యని అనుభూతి.

నేను డిగ్రీ ఫస్టుక్లాసులో పాసయ్యాను. ఏనుగెక్కి ఊరేగినంత సంతోషమైంది. మా ఇంటిపక్కనున్న మొహియొద్దీన్ చాచా సాయంతో నాకు ఉద్యోగం దొరికింది. అప్పుడు నామనసు.. మబ్బుల పట్టిన అకాశాన్ని చూసిన మయురములా డాన్స్ చేసింది.

అటు హైద్రాబాదులో యజమాని మరణించగానే ఇటు మా నాన్న ఉద్యోగ మూడిపోయింది. మా అమ్మ కంటతడి పెట్టింది.

"మన వాళ్లమీద రోజువారి అత్యాచారాలు పెరిగిపోయిన్నై. మన మిక్కడుండటం క్షేమం గాదు. మనం.... మన హైద్రాబాద్ కెళ్లి హాయిగా బతుకుదాం. కాయకష్టం చేసినా సరే... కంటినిండా నిద్రబోదాం." నాన్నను బతిమాలింది. నాన్న ధైర్యం వీడలేదు.

"బతుకు బాటలో అటంకాలొస్తూనే ఉంటాయి. అంత మాత్రన బాటనొదిలేస్తామా? ధైర్యంగా ఆటంకాలనెదిరిస్తూ ముందుకు పోవాలె. అయినా.... మన కొడుకులిద్దరూ ఉద్యోగాల్లో ఉన్నారు. మనకేం తక్కువైందని ఈ శ్రీనగర్ను వదలి వెల్దాం?"

"అదికాదు మావయ్యా, ఇక్కడ హిందువులకు రక్షణలేకుండా పోయింది. దినదిన గండంగా గడపాల్సివస్తుంది...." అక్కడే పుట్టి పెరిగిన వదిన గూడా వంత పాడడం ఆశ్చర్యమన్పించింది. అన్నయ్య వెంటనే కల్పించుకున్నాడు.

"నోరు మంచిదైతే ఊరు మంచిదన్నారు. మనమిక్కడే పుట్టాం, ఆడుకున్నాం పాడుకున్నాం. ఇది మన మాతృభూమి."

"తెలుగు నేలగూడా మన మాతృభూమిలో భాగమే గదా."

"అబ్బా .... చర్చ అనవసరం. చావైనా బతుకైనా ఇక్కడే తేల్చుకుందాం."

రోజులు గడుస్తున్నై ఐ.యస్సై శిక్షణ పొందిన మిలిటెంట్ల అగడాలు పెరిగిపోయిన్నై. ప్రార్థనా స్థలాల్లో పురుడుపోసుకున్న జీహాద్ కొందరి మనసుల్ని మలినం చేసింది. జె.కె.ఎల్.ఎఫ్, హిజబుల్ ముజాహిదీన్,లష్కరేతోయిబా మరెందరో మిలిటెంట్లు, వాళ్ల అగడాలు అనంతమై పోయినై. ప్రతిఘటించిన ప్రగతి శీల ముస్లిముల ప్రాణాలు తుపాకి తూటాలకు బలై పోతున్నై. లూటీలు, గృహ దహనాలు, మానభంగాలు, రోజువారీ కార్యక్రమాలైపోయినై. అయినా కాశ్మీర్.. శ్రీనగర్పట్ల మా మమకారం తగ్గలేదు.

ఓసారి... మా మిత్రులతో సినిమాకెళ్లాను. థియేటర్లో కూచున్నాం. ఇంకా సినిమా ప్రారంభం కాలేదు. పిచ్చాపాటి ముచ్చట్లకు దిగాము.

"ఏనాటికైనా కాశ్మీర్ పాకిస్తాన్‌లో కలిసిపోతుందేమో!" పెదవి విరిచాడో మిత్రుడు.

నా నరాల్లో రక్తం కుతకుతలాడింది." ఇంపాజిబుల్" అరిచాను." కాశ్మీర్‌ను భారత్‌నుండి విడదీసే శక్తి ఈ ప్రపంచములో ఎవ్వరికీ లేదు." పిడికిళ్లు బిగుసుకుపోయినై.

"ఇప్పుడట్లానే అన్పిస్తుంది. జీహాద్ పుణ్యమాని మైనారిటీ కాఫిర్లంతా కనుమరుగైపోతారు. అప్పుడే మవుతుందో నకేందెల్సూ"

"ఈరాష్ట్రంలోని మైనారిటీలే ఇతర రాష్ట్రాల్లో మెజారిటీలు ఆ రాష్ట్రాల్లో మెజారిటీలు ఇలాగే విజృంభిస్తే...."

సినిమా ప్రారంభమైంది. కాశ్మీర్‌నుభారత్‌నుండి విడిపోనివ్వద్దు. ... అశయం శాంతింపజేసింది.

శుక్రవారము నాడు అమ్మానాన్నలు గుడికెళ్లారు. తిరిగిరాలేదు. కత్తిపోట్లకు గురై దిక్కులేని చావు చచ్చి నడిబజార్లో పడున్న వాళ్ల శావాలను ఇంటికి మోసుకొచ్చినం. బస్తీలోని ముస్లిం మిత్రుల సాయంతో అన్నమో రామచంద్రా అంటూ అంత్యక్రియలు పూర్తి చేసినం.

లోకమంతా చీకటిగా... చిమ్మచీకటిగా కన్పించింది.

ఎక్కడోపుట్టి, ఎక్కడో పెరిగిన అమ్మా నాన్నలు జీవితమంతా కష్టాలు కడలినీదుతూ కాశ్మీర్లో ప్రాణాలొదిలారు. అక్కడే పుట్టి పెరిగిన మేము... వాళ్లను రక్షించలేక పోయాం... గోడు గోడు మన్నాం. మనసు గాయాలకు కాలమే వైద్యం చేస్తుంది గదా! పైగా మా ఆశయ మొకటుందాయె. కొద్దిరోజుల్లో కుదుట బడ్డాం.

చెల్లి పెళ్లి ప్రస్తావన వచ్చింది. వదిన నిలువెల్లా వణికిపోయింది.

"చూడండి!" సీరియస్‌గా చెప్పింది." ఇక్కడున్న మన కుటుంబాలు జమ్మూకు తరలి వెల్తున్నై. ముందు ముందు జమ్మూగూడా జబర్దస్తీకి గురికావచ్చు, మనం మీ సిద్ధిపేట కెళ్లిపోదా. మీరు కూలీ పంజేసినా నేను నాలుగిళ్లల్లో పాచిపంజేసినా సరే. అక్కడ ప్రశాంతంగా ఉందాం. మరదలుకు, మరిదిగారికి అక్కడే పెళ్ళిసంబంధాలు చూద్దాం. నామాట వినండి." చేతులెత్తి దండంబెడుతూ బతిమాలింది.

"నిజమే! ఇక్కడ మైనారీల బతుకులు అగాధమైపోయినై..." అన్నయ్య వదినకు వంత పాడతాడనుకున్నాను." పరిస్థితులు వేగంగా మారిపోతున్నై. హిందువులు మీద అత్యాచారాలు నిత్యకృత్యాలైపోయినై. కాని.... ప్రాణాలరచేతుల్లో పెట్టుకుని పారిపోయిన కాశ్మీరీ పండితులు నిలువ నీడలేక ఢిల్లీ పేట్‌మెంట్ల మీద అడుక్కుతింటున్నారు. తెల్సా! ఊరకుక్కల కంటే అధ్వాన్నంగా బతుకులీడుస్తున్నారు. ఎక్కడికో పారిపోయి జీవచ్ఛవాల్లా బతికే బదులు చావో బతుకో ఇక్కడే తేల్చుకుందాం." కరాఖండిగా చెప్పేశాడు. వదిన అవేదన కన్నీరై ధారలు సాగింది.

"నహీ! నామాట వినండి మరిదిగారూ! జెర మీరన్నా మీ అన్నయ్యకు చెప్పండి......."

"ఏం చెప్పాలివదినా!" నాలో ఉద్వేగం, అవేశం పొంగినై కాశ్మీరం భూతల స్వర్గము. ఇది మన భారత మాత నుదుటి సిందూరము. శ్రీనగర్ ఆతల్లి బుగ్గన చుక్కలాంటిది..."

"ప్రకృతి అందాలు ప్రాణాలను రక్షిస్తాయా?" వదిన గొంతు కీచుమంది. "కొంత మంది మతోన్మాదుల మారణ హోమాన్ని అరికడ్తున్నాయా? దుర్మార్గుల ఆగడాలకు అడ్డుగానిలుస్తున్నాయా?" పాపం దుఃఖం ఉప్పెనలా పైకి వచ్చిందేమో వెక్కి వెక్కి ఏడ్చింది.

... ఏదన్నా ప్రమాదం ముంచుకొస్తే, చిన్నప్పట్నుంచి కలిసి ఆడుకున్న అక్బర్, కరీం, జహంగీర్ లాంటి ప్రాణమిత్రులు మమ్మేల్నాదుకోరా! ఇక్కణ్నుండి హిందువులంతా పారిపోతే ప్రగతిశీల ముస్లిముల గతేమిటి? వాళ్లుగూడా జీహాద్ దాహానికి లొంగిపోతారు. అప్పుడు వాళ్లే ఈదేశానికి శత్రువులైపోతారు... భయమేసింది.

"ఈమట్టితో మన అనుబంధం అంత సులువుగా తెగిపోతుందా వదినా? ఇక్కడి సరస్సులు, మంచుకొండలు, పూలతోటలు మనల్ని పెంచి పోషించినై, మన శరీరం లోని అణువణువూ ఇక్కడి చెట్టూచేమ, కొమ్మారెమ్మల పలుకరింపుతో పులకరించిపోతుంది. పైగా ఇది మన పరువు ప్రతిష్ఠలకు సంబంధించిన విషయం, పరువు పోయాక ప్రాణాలతో ఉన్నా ఒకటే, లేకున్నా ఒకటే." మొండిగావాదించాను.

పాపం! వెక్కిళ్లతో తడబడుతున్న వదిన ఇంకేమీ అనలేదు. మా అమ్మానాన్నల ఫోటోకు నమస్కరించి "మీరు పుణ్యమూర్తులు ఇంకా నేనెన్ని విపరీతాలు చూడాలో, ఎన్ని బాధలనాభవించాలో!" అని చెల్లిని కౌగలించుకు బోరుమంది. ఎద పొదలోని అల్లరిని అతిప్రయత్నమ్మీద అపుకుంటూ చెల్లి వదినను ఓదార్చింది.

బడబాగ్నుల పొగలు, సెగల్ని కడుపులో దాచుకున్న ప్రశాంత సముద్రిడిలా-నా అంతరంగములో చెలరేగిన మంటల్ని అలాగే అదిమిపెట్టి నేను పైకి శాంతమూర్తిలా కన్పించాను. చెల్లి, అన్నయ్యల పరిస్థితి కూడా అదే కావచ్చు.

కేంద్ర ప్రభుత్వం తీసుకుంటున్న చర్యల వల్ల పరిస్థితిలో మార్పు వస్తుంది. దుష్టసంహారం జరిగితీరుతుంది. తిరిగి కాశ్మీర్లో శాంతిపూలు వికసిస్తాయి.... ఆశ కట్టి పడేసింది.

ఆరోజు.... ఫస్ట్ తారీకు, సాయంత్రం చెల్లికి పెళ్లిచూపులు. నైట్ డ్యూటీ ముగించుకుని అన్నయ్య పొద్దున్నే వచ్చాడు.

నేను డ్యూటి కెళ్లాను. సాయంత్రము జీతం అందుకుని స్వీట్సు, పళ్లు వగైరాలు కొనుక్కుని ఆటో ఎక్కాను.

...... మా గుండెలమీదాడుకున్న చెల్లి బావగారి గుండెల్లో గూడుకట్టుకుంటుంది. పెళ్లిలో బావగారినో ఆటపట్టించాలి. బిందెలో ఉంగరం వెతికేప్పుడు అయ్యగారిని ముప్పతిప్పలు పెట్టాలి...చెల్లి పెళ్లివేడుకల గురించి ఊహల్లో తేలిపోతూ ఇల్లు చేరుకున్నాను. ఇంట్లోంచి పెడబొబ్బలు, హాహాకారాలు వినబడుతున్నె. ఇంటి నిండా సాయుధులున్నారు. స్వర్గారోహణంచేస్తూ జారి మురికికాల్వలో పడిపోయినట్టైంది. లోపలికి పరుగెత్తబోయాను. ప్రాణ స్నేహితులు కరీం, జహంగీరులు చెరోరెక్కపట్టి ఆపేశారు. విడిపించుకోవాలని పెనుగులాడాను లాభంలేదు.

"వద్దురా రమేష్ వద్దు, ప్లీజ్ వాళ్లకుకనబడొద్దు..." కరీం వారించాడు.

"వాళ్లు నరరూపరాక్షసులు, జీహాద్‌సైనికులురా! కనీసం నీప్రాణాలన్నా దక్కించుకోరా!" జహంగీర్ కంటతడితో పక్కకు తొక్కెళ్లాడు. అంతరాళాల్లో అగ్నిపర్వతాలు బద్దలవుతున్నాయి. జరుగుతున్న ఘోరాన్ని కళ్లారా చూస్తున్నాను.

మొదట మా వదినను జుట్టుబట్టి బయటికి లాక్కొచ్చారు. భయంకరంగా నవ్వుతూ, జడ కత్తిరించారు. ఒంటి మీద నూలుపోగులేకుండా చేశారు. చురకత్తులతో బరబర స్తనాలు కోసేవారు. అదే కత్తుల్ని మర్మాంగములో దించేశారు. వదిన అంగలార్పులు, హాహాకారాలు వర్ణనాతీతం. ఉక్కుహస్తాల్లో నలిగిపోతున్న అన్నయ్య, చెల్లినోళ్లు మూసిఉంచారు. శక్తిమేరకు అరుస్తూ వదిన కాళ్లూ చేతులు కొట్టుకుంటూ అన్నయ్యవైపు చూసింది.

"న్నే..... ను చెబితే విన్నారా? మ్మీ.... మీర.....న్నా.."నిస్తేజమై ప్రాణాలొదిలింది.

తర్వాత చెల్లి గుడ్డలూడిచేశారు. కర్ణకఠోరంగా నవ్వుతూ తుపాకి మడమలతో బాదారు. మానరక్షణ కోసం.... తోడేళ్ల గుంపులో మేకపిల్లల్లా అరుస్తూ చెల్లి అటూ ఇటూ పరుగెత్తింది. ఇది కలియుగం గదా! నాచెల్లి పిలుపు ఏకృష్ణుడూ వినలేదు. ఎవ్వరూ ఆదుకోలేదు. ఒకరి తర్వాత ఒకరు పాశవికంగా మానభంగం చేశారు. అల్లాను తలుస్తూనే చెల్లి శరీరాన్ని ముక్కలుగా నరికేశారు. దానవత్వం దాహం ముందు మానమాత్వం మచ్చుకైనా మిగలలేదు. బయటికి లాక్కొచ్చి అన్నయ్య కాళ్లూ చేతులు నరికేసి ఇల్లంతా దోచుకున్నారు. చివరికి ఇంటికి నిప్పుపెట్టి విజయగర్వంతో వెళ్లిపోయారు.

గుండెలు బాదుకున్నాను. నేలమీద పడిబొర్లుతూ లబలబలాడాను. నావాళ్లకు అంత్యక్రియలు చేసే అవకాశం గూడాలేదు. సర్వస్వం కోల్పోయాను. అందాల కాశ్మీర్లోని ఆకుపచ్చమంటలు మాబతుకుల్ని కుక్కలు చింపిన విస్తరి చేసేసినై. నిర్దాక్షిణ్యంగా కాల్చిపారేసినై. రాత్రయేదాక కుళ్ళి కుళ్లి ఏడ్చాను. "ఇక్కడ నాకెవరున్నారు? ఏముంది?" మిత్రులనడిగాను.

"వెంటనే నువ్విక్కడనుండి వెళ్లిపోరా!" కన్నీరు మున్నీరుగా ఏడుస్తూ కరీం, జహంగీరు సలహాపడేసి వెళ్లిపోయారు. ఆ ధారుణ మారణహోమం కళ్లల్లో తిరిగినప్పుడల్లా పిచ్చివాణ్నైపోతాను...." కంటి ధారల్ని లుంగీతో అద్దుకున్నాడు.

"అక్కడ రైలెక్కి వరంగల్‌లో దిగాను. అక్కడ బస్సెక్కి ఈ సిద్ధిపేటలో దిగాను. ఇది మానాన్నపుట్టిన ఊరు. సిద్ధిపేట గురించి పారుపల్లి వీధి గురించి మానాన్న అప్పుడప్పుడు .... సగర్వంగా చెప్పేవాడు. ఇక్కడ మా బంధువులెవరున్నా ఉండొచ్చనుకున్నాను. మొదటి రోజు బస్టాండు ఆశ్రయమిచ్చింది. మర్నాడు అతికష్టమ్మీద ఈ అద్దెఇల్లు దొరికింది. చాయ తయారు చేయడములో మా వదిన నిష్ణాతురాలు. అమె చేతి చాయ అద్భుతం అనాడు సరదాగా నేర్పించిది.ఈరోజదే అన్నంబెడుతోంది. జీతం లొంచిమిగిలిన డబ్బులు చాయసామాగ్రి కొనిచ్చినై...."

కాసేపు మూగమనుషుల మయాము

"మీనాన్న పేరేమిటో!" వెంకయ్య ఆసక్తి.

"వి. నారాయణ......"

"వి. అంటే ......." ఆసక్తి రెట్టింపైంది.

"వేప నారాయణ పారుపల్లి వీధేనటా....."

"వ్వె....వే.....వేప నారాయణనా? వెంకయ్య మొహంనిండా వేయిదీపాల వెలుగు. "అతడు నా మేనత్త కొడుకే. నా బావనే. చిన్నతనములో కలిసి ఆడుకున్నాం.... బతుకుదెరువుకోసం హైద్రాబాదెళ్లాక మళ్లీ కనబడలేదు...." గబుక్కున లేచి రమేష్ చేతులందుకుని కళ్లకద్దుకున్నాడు." అయితే... నువు మా మేనల్లునివన్న మాటా..." తుండు గుడ్డతో రమేష్ మొహం అద్ది నుదురు ముద్దాడాడు.

ఎప్పుడొచ్చిందో ఏమో... గడపలో నుంచున్న గంగ చెంపలు కెంపులైపోయినై.

(జాగృతి - 13-8-2001)



# జేబుదొంగ

నెల రోజులు చెమటోడ్చి పంజేసిన జీతం డబ్బులు పర్సులోకొచ్చేసాయి. నోట్లతో కడుపుబ్బిపోయిన పర్సు అలవోకగా ఆవులించింది. దాని మూతిమూసేసి పాంటు జేబులో పడేసుకున్నాడు. హెడ్‌కానిస్టేబుల్ వెంకటస్వామి. అప్పటిదాకా ఆరేసిన మసిగుడ్డలాగున్న మొహం అరవిరిసిన గులాబీలా వెలిగిపోయింది.

ఉద్యోగ పర్వంలో ప్రవేశించి పదిహేనేళ్లు దాటింది. అంటే... ఇప్పటికి నూట ఎనభైసార్లు జీతం వచ్చింది. కాని.... తిన్న అన్నమే రోజూ తింటున్నా పాత పెళ్లాంతోనే రోజూ సంసారం చేస్తున్నా... ఎప్పటికప్పుడు అదో అనుభూతి. అలాగే నెలనెలా జీతం వస్తున్నా ఆ ఒక్కరోజు అనుభూతే వేరు.

ఏదో శంకుస్థాపన నెపంతో పట్టణానికొచ్చిన మంత్రిగారు తమ అధికార పార్టీ అధికార సభ్యులతోనూ చీలికవర్గం నాయకులతోనూ సంప్రదింపులు జరిపి ఊరు, దాటేసరికి మధ్యాహ్నం పన్నెండైంది. పోలీసు యంత్రాంగం మొత్తం గుండెలనిండా ఊపిరి పీల్చుకుంది. యస్పీగార్ని పంపించి టూటౌన్ స్టేషన్‌కొచ్చేసరికి ఎండమండిపోతోంది. పాత స్టేషన్లో కొత్త యస్.ఐలా చిటపటలాడిపోతుంది.

ఫాన్ వేసుకొని సీట్లో కూచోగానే ఒళ్లు చల్లబడింది. హాయిగా ఉంది, ఇంకాస్సేపలాగే ఉంటే నిద్రకూడా రావచ్చు.

పోలీసును చూసి పారిపోయిన తీవ్రవాదిలా కరెంటు మాయమైంది. ఇహ ఉండరాదు. స్టేషన్లో ఉంటే లాభంలేదు. ఉసూరుమంటూ సైకిలెక్కాడు. ఇంటికి చెక్కెయ్యాలనుకున్నాడు. సైకిల్ పరుగెత్తుతూంది బుర్రలో ఏదో మెదుల్తూంది. ఒస్టాండ్‌దాకా వచ్చేసరికి షడెన్ బ్రేక్ పడింది. చాయ్ తాగాలన్పించింది

ఇంత బతుకూబతికి ఇంటెన్క చచ్చినట్టు ఇన్నేళ్ళు పోలీస్ డిపార్టుమెంట్‌లో పంజేస్తూ సొంత డబ్బుల్తో చాయ్ తాగాలా! అవమానం కానిస్టేబులెవడన్నా చూసినా లేదా పాత కేడీగాడెవడన్నా మధ్యలో వచ్చినా... పోలీస్ పరువు పచ్చకర్పూరంలా హరించుకు పోతుంది.

ఆనంద్ భవన్ ముందు సైకిలాగింది. హోటల్లో జనార్ధన్. ఆహా! అపర శిబిచక్రవర్తిలా కన్పించాడు. ప్రాణం లేచొచ్చింది.

"ఏం రా తమ్మీ..... జనార్ధన్.... ఏం సంగతులూ?" పక్కన కూచున్నాడు.

జేబులు కత్తిరించడంలో జగాన్ని జయించిన మేటి కళాకారుడు జనార్ధన్.

"ఏం లేదన్నా.... ఇప్పుడే వచ్చిన. చాయ్ తాగుదామా?" వినమ్రంగా అడిగాడు.

"చాయ్‌నా!...... ఎండలేమో దండిగున్నయ్. గీ ఎండపూట చాయ్ ఏం బాగుంటదీ! కూల్ డ్రింకైతే జర పానం చల్లబడ్తది గదా!

"ఓదాందేముంది .... తాగేద్దామన్నా!"

"అంటే.... ఏదీ తినక ముందే తాగుదామా?"

"ఏం తిందామన్నా.... ఇయ్యాల్ల గిరాకి లేదు. నా మనసు మారిపోతుంది."

"అవన్నీ నాకు జెప్తావా! రానీ.... చికెన్ బిర్యానీ తిందాం తమ్మీ...అరె నెలకొక్కసారన్నా కోడి బిర్యాని తినకపోతే ఏం బతుకురా?"

భుజమ్మీద చెయ్యి. చూపులు కళ్లలోకి.

జనార్ధన్ ఐసైపోయాడు. చికెన్ బిర్యానీకి అర్డరిచ్చాడు. గట్టిగా కౌగలించుకున్నాడో సారి. అవురావురుమంటూ తినేశారు.

కూల్‌డ్రింక్ కార్డరైంది.

"ఏంరా జన్నూ! ఈ నడుమ కన్పిస్తనేలేవు. ఊర్లో లేవా?' వీపు నిమిరాడు.

ఓ నిమిషందాకా జవాబు రాలేదు. జనార్ధన్ మొహం అదోలాగైంది.

"ఏమైంది తమ్మీ! వేరే ఊర్లో జేబుగొట్టి జైలుకుపోయొచ్చినవా?"

"కాదన్నా....."

"మరేమైంది తమ్మీ?"

"ఈ సిద్ధిపేటకూ నాకూ రుణం తీరిపోయిందన్నా!'

షాక్ తగిలినట్టయింది వెంకటస్వామికి.

"ఏం రా.... ఎందుకూ?"

"ఏం లేదన్నా మొన్న మా ఊరి నుండి వచ్చిన కొన్ని రోజులక్కడనే ఉన్న."

"గా పల్లెటూర్ల జేబులుగొడ్తే.... ఇంగ నువు బతికినట్టే .....మమ్మల్ని బతికించినట్టే."

"అది కాదన్నా.... నాకు పెండ్లి ఖాయమైంది. జేబులు గొడ్తలేను. పెండ్లిజేసుకొని కట్నం డబ్బుల్తోని ఏదాన్నా యాపారం జేస్కుంటా."

అసలు షాకు ఇప్పుడు తగిలింది.

"అరే... గట్లంటే ఎట్లరా? నువ్వు లేకుంటే మా గతేందటా? మా ఆదాయం పడిపోతదిరా. అసలూ... జేబులు గొట్టడంలో నిన్ను మించిన మొనగాడు మా టూటౌన్ ఏరియాలనే కాదుగదా హోల్‌మొత్తం మన జిల్లాలోనే ఎవడూలేడు తెల్సా! నీ గురించి మేము... చాలాసార్లు మాట్లాడుకుంటుంటాం."

"గిట్ల... దొంగ బతుకింకెన్నేండ్లన్నా? రోజంతా బస్టాండ్ల బేజులుగొట్టాలె. రాత్రికి మీకు సగం పంచియ్యాలె. దొరికిపోతే పబ్లిక్ మా పక్క బొక్కలిరగ్గొడ్తరు. మిగిలిన బొక్కలు మీ లాఠీ దెబ్బలకిరిగిపోతే. గిట్ల మా జేబుదొంగల బతుకు తెల్లారిపోతది... ముసలితనంలో ఎవ్వడూ దగ్గరికి రానియ్యడు బిచ్చమెత్తుకోవాలే."

"అరె.... పూర్తిగా మారిపోతున్నావురా!"

"ఔనన్నా.... మారిపోయిన. దొంగబతుకు నాకొద్దిహ. ఇది నేను నీకు తాగించే ఆఖరి కూల్‌డ్రింక్ బాస్."

ఇద్దరూ కూల్‌డ్రింక్స్ లాగిస్తున్నారు.

"అరెరే .... బంగారుమనుంటి దొంగబుద్ధి బజార్ల పారేసుకున్నావా? గట్ల నిర్ణయించుకున్నవేందిరా?"

"ఔనన్నా! ఇగో.... బ్యాగుతోసహా వచ్చిన. ఇక్కణ్ణుంచి బస్సెక్కిపోతా." కాళ్లవద్దనున్న ఎయిర్ బ్యాగ్‌ను కళ్లతో చూపించాడు."

"మీరు నాకెంతో సాయం జేసిన్రన్నా. ఎన్నిసార్లు పట్టుబడ్డా కన్నతండ్రోలె... అందరి ముంగిట కొట్టి చాటుకు విడిపించిన్రు. మీ సాయం ఈ జన్మలో మరువలేనన్నా!"

జనార్ధన్ కళ్లల్లో నీళ్లు దిరిగినై. చలించిపోయాడు వెంకటస్వామి, కడుపులో దేవినట్లైంది.

"పొద్దుగాలలేచి ఎవల మొఖం జూచిన్నో... నాకిద్ది చెడ్డ వార్తరా?" అంటూ ఎందుకైనా మందిదని పాంటు జేబు తడిమి చూసుకున్నాడు. పర్స్ భద్రంగా ఉంది. బరువెక్కిన గుండెల్తో బయటికొస్తుంటే జనార్ధన్‌ను గుండెలకు హత్తుకోవాలన్పించిది. కాని బాగన్పించలేదు.

ఇరవై రూపాయల నోటు వెంకటస్వామి చేతిలోపెట్టి సమస్కరించాడు జనార్ధన్.

"ఇంగ వస్తనన్నా!"

"సరేరా... సల్లగా బతుకు తమ్మీ!" అంటూ మరోసారి జేబు తడుముకున్నాడు. పర్స్ క్షేమంగా ఉంది.

ఇంటికెళ్లగానే ఇల్లాలు ఎదురొచ్చింది. చిరునవ్వులు చిందిస్తూ కొత్త పెళ్లి కొడుకులా సిగ్గులు మేళవించి "ఇగో.... ఇది నానెల జీతం... తీస్కో.... పైజలు జెర జాగ్రత్తగా ఖర్చుపెట్టు" పర్సు అందించి డ్రెస్సు మార్చుకుంటున్నాడు. వికలమైన మనస్సులో జనార్థన్ మెదుల్తున్నాడు.

పర్సు చేతికి రాగానే ఇల్లాలి మొహం ఇందీవరములా విచ్చుకుంది. పర్సు విప్పగానే అరిపోయిన హారతి పళ్లెమైపోయింది. వెంకటస్వామికి వెర్రి లేదుగదా!.

"ఇదేందయ్యా.... ఖాళీ పర్సు....మజాక్ చేస్తున్నావా? రుసరుసలాడ్తూ పర్సు విసిరేసింది.

హెడ్‌కానిస్టేబల్ హెడ్డులో కోడిగుడ్డు దొర్లింది.

"అరె..... ఇది నా పర్సుకాదు గిది నాజేబులకెట్టొచ్చిందబ్బా! మరి నా పర్సేమైందీ?" ఆందోళనగా పర్సునటూ ఇటూ తిప్పిచూశాడు.

"ఎవడో మాయంజేసిండు, చేసేది పోలీస్ నౌకరీ చూసేది వైసుపోరీలను జూస్తే వంకరదిరిగిపోతివి. కాలేజిపోరి కన్పిస్తే కంట్లో కారంగొట్టినట్టాయె. కాలు కదలదాయె...." భార్య ధుమధుములు. పుండు మీద పచ్చికారం పూసినట్లైంది. కాని ఏం చేయ్యాలి?

"హరి నా కొడుకా... జనార్థనా... ఎంత పంజేస్తివిరా.... ఎంత నాటకమాడ్తివిరా!.... ఇంతకీ నీదే ఊరురా...!" గొణిగాడు మింగలేక కక్కలేక సతమతమై.... గుడ్లు మిటకరిస్తున్నాడు.

(ఆదివారం - ఆంధ్రభూమి- 29-10-1995)



# పట్టుగొమ్మ

"మీరు దినపత్రిక చదువుతారా సార్?"

తెల్లవారగానే... పొద్దు బారెడెక్కిందో లేదో - తలుపు తట్టి ఇంట్లోకొచ్చి అడిగాడో యువకుడు. ఆ యువకుణ్ని ఎగాదిగా చూస్తూ జవాబు కోసం తటపటాయిస్తున్నాడు మల్లేశం.

'మీకు దినపత్రిక చదివే అలవాటుందా సార్?' హుషారుగా అడిగాడా యువకుడు మళ్ళీ.

ఈ వ్యక్తిని ఎక్కడా చూసినట్టు లేదే!

"పత్రిక చదవకపోతే ప్రపంచమెట్లా తెలుస్తుంది? ఈ రోజుల్లో... ఈ సిద్దిపేట లాంటి మహా పట్టణాల్లో పక్కనున్న ప్రశాంతినగర్‌లో ఏం జరుగుతుందో గణేశ్ నగర్ వాళ్లకు తెలియాలంటే దినపత్రికనే దిక్కు గదా!"

"కరెక్ట్ సార్! ఈ యాంత్రిక యుగంలో దినపత్రిక ప్రాధాన్యత బోలేడంత పెరిగింది గదా. ప్లీజ్ కూచోండి సార్." చాకులాంటి యువకుడు చలాకీగా నవ్వుతూ పక్కనున్న కుర్చీలో కూర్చున్నాడు. ఆశ్చర్యం... అనూహ్యం.

ముక్కూ మొహం తెలీని వ్యక్తి నా ఇంట్లోకొచ్చి నా కుర్చీలో కూర్చుని.... నాకు మర్యాదిస్తున్నాడే! భేష్ మంచి కుర్రాడే!

వికసించిన మల్లేశం ముఖారవిందాన్ని వినయంగా చదివేస్తూ. "ప్లీజ్ కూచోండి సార్!" అన్నాడా యువకుడు మళ్ళీ.

"సరే ...... చెప్పండి, మీరెవరూ?"

తానో దినపత్రిక ప్రమోటర్ననీ, ఆ పత్రిక ప్రత్యేకతలన్నీ ఏకధాటిగా ఏకరువు పెట్టాడు.

అబ్బో! పిట్టకొంచెం, కూత ఘనం లాగుందే!

"మరీ..." భృకుటి చిన్నగా ముడేసుకుంది. "మీ ఇంట్లో పత్రిక కనపడ్డంలేదు..." చూపులు టీపాయ్ అంగాంగాన్ని తడిమాయి.

'ఆఫీసులో చదువుతానండీ' నవ్వాలనుకున్నాడు మల్లేశం.

'విలువైన ఆఫీసు టైంను పత్రిక చదివేందు కుపయోగిస్తే... మరి నిద్రకెట్లానండీ?'

బాగానే వుంది జోకు. అది మల్లేశం పెదాల మీద చిరునవ్వు పూయించింది. "ఇంకా మా ఆఫీసు అంత అభివృద్ధి సాధించలేదండీ."

"అయ్యో పాపం! పుట్టెడు ఫైళ్ళతో కుస్తీపడుతూ పత్రిక ఆసాంతం చదవగల్గుతున్నారా?"

"ఊహు! హెడ్‌లైన్స్..."

"ఆ.... కరెక్ట్! నిజానికి మీలాంటి సిన్సియర్ ఉద్యోగికి ఆఫీసులో పేపర్ చదవాలంటే మనసొప్పదు. ఒప్పినా టైం దొరికి చావదు."

హమ్మయ్య! నా సిన్సియారిటీని గుర్తించే మనిషొకడున్నాడన్నమాట... తృప్తిగా నిట్టూర్చాడు.

నిజమే... పత్రిక ఇలా చేతిలో కొస్తుందో లేదో అలా అర్జంట్ ఫైల్ ముందుకొస్తుంది. రెండు వాక్యాలు చదువుతానో లేదో ఇద్దరు ముగ్గురొచ్చి తమ ఫైల్ గురించి పట్టుబడ్తారు.

శ్రీమతి మల్లేశం చెరో టీ కప్పు అందించింది.

"థాంక్యూ సిస్టర్! ఆహా... అబొట్టూ, కాటుక, కాళ్ళకు పారాణి... మహాలక్ష్మి లాగున్నారు"

"లాగ కాదు. ఆమె పేరే మహాలక్ష్మి!" సిగ్గుముంచుకొచ్చింది మల్లేశంకు.

"భర్త సిగ్గులను ఓరకంటితో ఏరుకుంటూంటే మహాలక్ష్మి బుగ్గలు ఎర్రబారినై,

"అదే పత్రిక మీరు ఇంటికి తెప్పించుకున్నారనుకోండి..." ప్రమోటర్ హాయిగా ఇలా టీ తాగుతూ అలా అలా పత్రిక తిరగెయ్యొచ్చు. అన్ని పేజీలు హాయిగా చదివెయ్యొచ్చు. అసలూ... పత్రిక చదువుతున్నంతసేపూ మనం మరో లోకంలో విహరిస్తుంటాం. అదొక గొప్ప థ్రిల్లండీ బాబు."

"కరెక్ట్ బ్రదర్!" మహలక్ష్మి అందుకుంది. తానూ ఓటికప్పు ఖాళీ చేస్తూ భర్త కళ్ళల్లోకి చూసింది. "మీరు ఆఫీసు కెళ్ళింతర్వాత నేను తీరిగ్గా చదువుకోవచ్చు. అదే పత్రికను సాయంత్రం బడి నుండి వచ్చి మన పిల్లలిద్దరూ చదువుకోవచ్చు"

"అన్నట్టూ మా పత్రికలో మహిళలకు, బాలలకు ప్రత్యేక పేజీలున్నాయి గదా!" ఫైల్లోంచి అప్లికేషన్ ఫారం తీసి మల్లేశం ముందుంచాడు. "ఇక్కడో సంతకం చేయ్యండి సార్!"

** ** ** ** **

"పేపర్.... పేపర్ సార్!" మర్నాడుదయం పేపర్ కుర్రాడు తలుపు తట్టాడు.

"అబ్బా! కమ్మని నిద్ర పాడైపోయింది." కళ్ళు నులుముకుంటూ తలుపు తెరిచాడు మల్లేశం. చీకటి ఛాయలు మాయం కాలేదింకా.

పల్లెటూళ్ళో కోడిలాగ పట్నంలో పేపర్ కుర్రాడు.

"రోజు గిట్లనే లేపుమంటూరా సార్!" పత్రిక అందిస్తే అడిగాడు. బంగారం లాంటి నిద్రకు రోజూ భంగాపాటెందుకూ?

"ఊహు! అదో ఆ కిటికీలో ఉంచి వెళ్లిపో" కిటికీ చువ్వలు చూపించాడు.

కాలకృత్యాలు ముగించి టీపాయ్ మీద పత్రిక అందుకున్నాడు.

కళ్ళు అక్షరాల వెంట పరుగెత్తుతున్నై. వార్త వెంట వార్త చదువుతూ పోతూంటే .. అదో దివ్యానుభూతి. కాలమెట్లా గడుస్తుందో తెలీలేదు. .... కుర్చీలోంచి లేవలేదు.

ఇంటికి పత్రిక తెపిస్తే... ఇంత సుఖంగా ఉంటుందా!

"మీరు పత్రిక తెప్పిస్తున్నారా సార్?" ఇంటి ముందాయన మందహాసం.

"అవునండీ...." తల గర్వంగా పైకి లేచింది.

ఉదయం నిద్రలేవగానే కిటికీలోంచి పత్రిక తీసుకోవడం, కాలకృత్యాలు తీర్చుకుని కాలుమీద కాలేసుకుని టీ సేవిస్తూ చదవడం... ఆ తర్వాత ఇంటి ముందాయనొచ్చి పత్రిక పట్టుకెళ్ళడం... మల్లేశంకు సరదాగానే ఉండి గాని మహాలక్ష్మికి తృప్తిగా లేదు. పనులన్నీ ముగిశాక పత్రిక కోసం ఇల్లిల్లూ తిరగాలి.

"మా పత్రిక మీ దగ్గరుందా?" నోరుతెరిచి అడగాలి.

ఇప్పుడే ఇంటిపక్కవాళ్ళు తీసుకెళ్ళారనో, ఇదో ఈ పేజీ చదవగానే ఇచ్చేస్తాననో మరేదో సమాధానమొస్తుంది. బయటికెళ్ళిన పేజీలన్నీ తిరిగి రావు. ముక్కలై ఎక్కువగానో, చినిగి తక్కువగానో వస్తాయి.

పుస్తకం వనితా విత్తం. హరహస్తం గతం గతః

అథవా పునర్వాయాతి జీర్ణం, భ్రష్టా చఖండశః.... అన్నారు గదా. పుస్తకం కేటగిరీలోకి పత్రిక గూడా వస్తుందాయె.

వెతగ్గా వెతగ్గా పత్రిక చేతికొచ్చి అరగంటవుతుందో లేదో మరెవరో వచ్చి పట్టుకెల్తారు. సాయంత్రం పిల్లలు చదవాలంటే మరోసారి సర్వేచేసి పట్టుకోవాలి.

సమస్యలన్నీ మల్లేశం ముందుంచింది మహాలక్ష్మి

"ఆఫ్టరాల్ పత్రిక కోసం ఇరుగుపొరుగు వారితో తగాదా పెట్టుకోలేం గదా!" అనేశాడు అలవోకగా.

మరో రోజు ఉదయం కిటికీలో పత్రిక లేదు. పాపం! పేపర్ కుర్రాడు మర్చిపోయుంటాడు. చేతిలో పత్రిక లేక పోయేసరికి... ఏదో పోగొట్టుకున్నట్టుంది.

మర్నాడదే తంతు.. కుర్రాడు మళ్ళీ మరిచాడా! ఆనపి జిజ్ఞాస, అంతులేని ఆసక్తి...

గబగబా చౌరస్తా కెళ్ళి మరో పత్రిక కొనుక్కొచ్చుకున్నాడు. సాయంత్రం ఆఫీసు నుండి వచ్చేప్పుడు పేపర్ ఏజెంటును కలిశాడు. కుర్రాడక్కడే వున్నాడు.

"నాకు పత్రిక పంపించడం లేదెందుకూ?" అడిగాడు.

"అయ్యో.... రోజూ పంపిస్తున్నానే. ఏరా! సార్‌కు పత్రిక వెయ్యడంలేదా?" కుర్రాడినడిగాడు ఏజెంటు.

"వేస్తున్నాను. రోజట్లాగే కిటికీలో ఉంచేస్తున్నాను సార్."

ఉసూరుమంటూ ఇంటికొచ్చాడు.

ఇంటి ముందు వాళ్ళబ్బాయి రెండ్రోజులు పత్రికలిచ్చి

"పొద్దున మీరు నిద్ర లేవట్లేదు గదా. అందాకా చదువుదామని తీసుకున్నాం మామయ్యా" తుర్రుమన్నాడు.

మొదట ఉలిక్కిపడి ఆ తర్వాత అవాక్కయాడు.

"పత్రిక తెప్పించి ఏం లాభమండీ?" ముక్కుమీద వేలేసుకుంది మహాలక్ష్మి.

"ఛీఛీ... ఏమన్నా అందామంటే ... వాళ్ళేమనుకుంటారో!

"నిజమే... కానీ రోజు ఇలాగైతే ఎలా? ఏదన్నా ఉపాయమాలోచించాలి గదా!" పక్కకొచ్చి కూచుంది.

"కరుణేశు మంత్రివి గదా.... మాంఛి సలహా పారెయ్"

కాస్సేపు నెత్తి గోక్కుంది. మరి కాస్సేపు చేతులు నలుపుకుంది. చూపులు శూన్యంలోకి విస్తరించినై.

"ఆ.... పత్రిక వద్దని చెప్పెయ్యండి"

"బోడి సలహా!" అరికాలు మంట నెత్తికెక్కింది.

"ఆ మాత్రానికే అంత సీను క్రియేట్ చెయ్యాలా?"

"అయ్యో.... వద్దంటే... పత్రిక ఇంటికి వద్దని చెప్పండి. మీరు ఆఫీసు కెళ్ళేప్పుడు ఏజెంటు దగ్గరే తీసుకుని బస్సులో చదువుకోండి. మీరు ఆఫీసు నుండి వచ్చాక మేం చదువుకుంటాం."

ఇదేదో బాగానే ఉందే, లోకల్ బస్సెక్కి దిగేలోగా చదివి పారెయ్యొచ్చు.

కరణేశు మంత్రి సలహా కార్యరూపం ధరించింది. ఆఫీసు కెళ్ళేప్పుడు పేపర్ స్టాల్ దగ్గర పత్రిక తానే తీసుకున్నాడు. బస్సులో పత్రికా పఠనం సాగింది. చివరిస్టేజీ వచ్చేలోగా... చివరి పేజీ కొచ్చింది. సాయంత్రం తిరిగి వచ్చేప్పుడు ....సంపాదకీయం కూడా పూర్తయింది. ఇంటికి రాగానే పిల్లలందుకున్నారు. బస్సులో నుంచుండి కూడా పత్రిక చదవొచ్చనేది ప్రాక్టికల్‌గా తెలిసిపోయింది.

మర్నాడు.... బస్సులో పత్రిక విప్పాడు ఖుషీగా.

"ప్లీజ్.... ఓ పేజీ ఇవ్వండి సార్!" పక్క సీటాయన చిరుహాసం చిందిస్తూ సగం పేజీలు లాక్కున్నాడు. మిగతా సగం పేజీలు చదివి.

"ఏదండీ... నా పత్రిక ఇవ్వండి." అడిగాడు.

"ఏం పత్రికా? పెళ్ళి పత్రికనా?" గుర్రుమన్నాడు పక్కాయన.

అయన... ఆయన కాదు. ప్రయాణీకుడు మారిపోయాడు.

"ఇక్కడున్నాయన నా పేపర్ తీసుకున్నాడు." ఆవేదన.

"ఆయన పోయిన స్టేజీలనే దిగిండు"

రోజూ అలాగే అవుతూంది. పత్రికతో బస్సెక్కగానే తోటి ప్రయాణీకులు తలా ఓ పేజీ లాక్కుంటారు. ఆ పేజీలు రొటేషన్ పద్ధతిలో మార్చుకుంటూ అంతా చదివివేస్తారు. బస్సు ఎక్కేప్పుడు ఫుల్‌పేజీతో... ఏనుగులాగున్న పత్రిక దిగేప్పుడు పీనుగులా మిగుల్తోంది.

ఇవ్వనంటే... వాడి చూపులు, వేడి నిట్టూర్పులు. ఇస్తే.. ఇంతే సంగతులు.... అదృష్టం బాగుండి కొన్ని పేజీలన్నా మిగుల్తున్నాయి.

రాత్రి పిల్లలు నిద్రబోయాక భార్యభర్తల సమాలోచన సాగింది. బుర్ర చించి ఆలోచించి సమస్యను సాకల్యంగా చర్చిస్తున్నారు. మల్లేశం బుర్రలో మెరుపు.

"పోని... మనం కూడా పత్రిక కొనడం మానేస్తేనో..." అసలు సిసలైన పరిష్కారం దొరికినట్టు ఫోజిచ్చాడు.

"చిఛీ..." ముద్దమందారం లాంటి మహాలక్ష్మి మొహం వాడిన గులాబీ లాగైంది. "ఎలుకల బాధ భరించలేక ఇల్లు తగులబెట్టుకుంటామా? అందరూ అట్లానే ఆలోచిస్తే పత్రికలూ, ప్రజాస్వామ్యం బతికి బట్టకడ్తాయా? ఆధునిక యుగంలో పత్రికలు లేకపోతే ప్రపంచం తలకిందులైపోతుంది గదా!"

"మరెట్లా.... ఏంచేద్దాం?" జుట్టు పీక్కోవాలన్పించింది. షర్టు చించుకోబోతే మహాలక్ష్మి ఆపేసింది.

తర్జనభర్జన సాగింది. అర్ధరాత్రి అరుణోదయమైంది. పరిష్కారం ఫార్ములా పాసైపోయింది.

మర్నాడు ఏజెంటుకు చెప్పాడు - పత్రిక ఇంటికే పంపమని.

ఉదయం .... చీకటి కాకులు రెక్కలు విప్పుతున్నాయి. ఇంట్లో అలారం గడియారం గొంతెత్తి అరిచింది. మల్లేశం నిద్రమత్తు వదిలింది. పత్రిక స్వయంగా అందుకున్నాడు. తానే వెళ్ళి పాలపాకెట్లు తెచ్చుకున్నాడు. కూలి డబ్బులిచ్చి పాల పాకెట్లు ఇంటికి తెప్పించుకునే పద్ధతి ఆ రోజు నుండి ఆగిపోయింది.

స్నానాదులు ముగించి కాలు మీద కాలేసుకుని కుర్చీలో కూచున్నాడు. పూజ ముగించుకున్న మహాలక్ష్మి టీ కప్పు అందించింది. టీ సేవనంతోపాటు పత్రికా పఠనం సజావుగా సాగిపోతోంది. ఆహా! నందన వనంలో విహరిస్తున్నట్టుంది.

ఆ దృశ్యం ఇంటి ముందాయన కంటిలో నలుసైంది. వెంటనే వాళ్ళబ్బాయిని పురమాయించాడు.

"మామయ్యా! మా నాన్న పేపర్ తీసుకురమ్మన్నాడు"

"ఇవ్వనని చెప్పు ఫో!" గొంతులో గాంభీర్యం.

అరగంట గడిచింది.

ఇంటి పక్కాయన స్వయంగా వచ్చేశాడు.

"ఏం సార్! టీ తాగడం అయిందా?" మాడిపోయిన పెదాల మీద వాడిపోయిన నవ్వు.

"అవుతోంది!" పత్రికలోంచి తలెత్తలేదు.

"ప్రజాస్వామ్యానికి పత్రికలు పట్టుగొమ్మలు గదా సార్."

"అవునవును"

"ఇహ మీరో టెలిఫోన్ పెట్టించుకుంటే బ్రహ్మాండంగా ఉంటుంది సార్" ఎదురుకుర్చీ నాక్రమించడం. మల్లేశం ఓరకంటితో చూశాడు.

"పెట్టించుకుంటా గానీ... దాన్ని నేనే ఉపయోగించుకుంటా. ఇతరులెవ్వరూ వాడుకోవడానికి వీల్లేదు" పైకి అనేశాడు.

"అంటే ...... ఇరుగూ పొరుగూ......'

"మా ఇరుగు పొరుగు వాళ్ళు చిల్లర వెధవాయలు కారు. వాళ్ళు ఇతరుల ఫోన్ మీద ఆధారపడిలేదు"

అమాయక చక్రవర్తి అనుకున్న మల్లేశం మాయాబజార్లో ఘటోత్కజుడయాడేమిటీ.

"అయితే ... పత్రిక కూడా...."

"అవును పత్రిక కూడా ఎవ్వరికివ్వొద్దని నిర్ణయించుకున్నాం." నవ్వుతూ కళ్ళల్లోకి చూశాడు.

"ఎంతైనా... ఇరుగు పొరుగు వాళ్ళమన్నప్పుడు అ మాత్రం కోఆపరేషన్....."

"ఉండి తీరాలి.. కాని మన కోఆపరేషన్ కార్పోరేషన్గా మారగూడదు."

"అ...టే......"

"ప్రజాస్వామ్యానికి పత్రికలు పట్టుగొమ్మలు కదా! రేపట్నుంచి మీ ఇంట్లో పత్రిక వెయ్యమని ఈ రోజే ఏజెంటుకు చెబుతున్నా పత్రికలు నిలదొక్కుకోవాలంటే కొని చదవాలని మీరొప్పుకుంటారు నాకు తెలుసు..."

అస్త్రం ఎదురు తిరిగింది అయిష్టంగా లేచి భారంగా అడుగులేస్తున్నాడు ఇంటి పక్కాయన.

"అన్నట్టూ ... మనింటి ముందాయనతో దినపత్రిక కొనిపించే బాధ్యత మీదే. పట్టుగొమ్మల్ని పట్టుబట్టి పెంచుకోవడం మన కర్తవ్యం సోదరా!"

అప్పటికే ఆయన గడప దాటాడు.

మహాలక్ష్మి అంతా చూసింది. ఆనందానికి అవధుల్లేవు. 'హమ్మయ్య! మావారు మామూలు మల్లేశం కాదని నిరూపించుకున్నారు.....' గలగలా నవ్వేసింది. ఆగలేక వచ్చి అమాంతం.....

(ఆదివారం- ఆంధ్రభూమి - 27-2-2000)



# నాగమ్మ నవ్వింది

అల్పజ్ఞుని గంభీరోపన్యాసంలా - మార్చినెలలోనే ఎండ మండిపోతూంది.

"చైత్రం రానే రాలేదింకా - ఎండేమో దండిగైపాయె" నంగునూరు బస్సుదిగి గొణుక్కుంది నాగమ్మ. అరవై వసంతాలను అరమరికలు లేకుండా దాటేసిన వయోభారాన్ని మోస్తూ బస్టాండు దాటింది. నుదుటి అనుభవ రేఖల మధ్య రూపాయి కాసంత కుంకుమ బొట్టు. సూర్యకిరణాలు సూటిగా పడి ఐదురాళ్ళ ముక్కుపుడక పంచరంగుల చిత్రంగా మారింది. మొహానికి సాయపసుపు రాసుకుందేమో అచ్చం అమ్మవారి లాగుంది.

అలవోకగా అడుగులేస్తూ ఆరుతోవల సెంటర్ దాటింది. సుభాష్ రోడ్డు మీద వచ్చిపోయే జనాలు విచిత్రంగా కనబడుతున్నారు. ఎలుకల వేటలో పిల్లుల్లా - బస్టాండ్ నుండే వెంబడిస్తున్న బలరాం, యాదగిరిలు మొహాలు చూచుకున్నారు. వాళ్లిద్దరి ఫోటోలు బస్‌స్టేషన్‌లో అతికించిన జేబుదొంగల జాబితాలో ప్రముఖంగా చోటుచేసుకున్నై. పళ్ళికిలించి కళ్లతో మాట్లాడుకున్నారు.

"అయ్యోపాపం పెద్దమ్మా! ఆయాసమొస్తుందా?" బలరాం చల్లని పలకరింపు.

"అరెరే! గింత ఎండల... కాళ్లకు చెప్పుల్లేవు. కండ్లకు అద్దాల్లేవు. ఏంపని మీదొచ్చినమ్ పెద్దమ్మా?" యాదగిరి సానుభూతి.

"గాంధీనగర్ల నా మనుమరాలుంది. చూసిపోవాలని వచ్చిన బిడ్డా!" ఇద్దర్నీ కలియజూసి కనురెప్పలమీది చెమటను కొంగుతో అద్దుకుంది. చేతికున్న రవ్వల గాజులు తళుక్కుమన్నై. రెండుజతల కళ్లు చెమక్కుమన్నై.

"గవ్వేం గాజులు పెద్దమ్మా! బొగ్గులోలే నల్లవడిపోయినై!"

"ఔన్నాయనా! ఇవి పాతపడిపోయినై. సొక్కం బంగారం.... వీటిని అమ్మేసి కొత్త నగ చేయించుకుంటే బాగుంటుది కానీ... గా బంగారం సంగతులు నాకేం దెలుస్తయ్."

"నిజమే పెద్దమ్మా ఇంగో... ఇటు జూడు!" యాదగిరి చేతిలో మూడువరసల ముత్యాలహారం. కళ్ళు జిగేల్‌మన్నై.

"ఆహా! బంగారంది గదా! శానా బాగుంది బిడ్డా!" ముడతల బారిన మొహం మువ్వన్నెల ఝుండాలా విచ్చుకుంది"

లారీ ఒకటి రాక్షసిలా అరుస్తూ వెళ్లిపోయింది. అటోరిక్షా ఎదురొచ్చింది.

"ఎన్ని తులాలుంటదో!"

"మూడు తులాల బంగారం, రెండు తులాల ముత్యాలు. నిన్ననే చేయించినం పెద్దమ్మా! మా అమ్మకోసం కష్టపడి చేయించినం."

"నా గాజులు గూడా మూడు తులాలే. ప్చ్..... ఏం లాభం! వీటి బదులు గసొంటి హారమున్నా బాగుండేది" పెదాలు చప్పరించింది.

"అరేయ్ యాద్గిరీ! గీ పెద్దమ్మ మనమ్మ లెక్కనే ఉంది గదరా! పాపం, చానా మంచి మనిషిరా!" బలరాం విచార సాగరములో మునిగాడు.

"ఔనన్నా! మరి గీహారం ఈ పెద్దమ్మకిచ్చి ఆ గాజులు దీస్కోని మనమ్మకిద్దామా! ఈమె గూడా మన కన్నతల్లనుకుందాం!" కండలు పెంచిన యాదగిరి గుండె కరిగి నీరైనట్టుంది.

"ఆ... నిజమా బిడ్డా!" నాగమ్మ కాళ్లకు బ్రేకులు కడినై. కళ్లల్లో ఆశ తొంగి చూచింది.

"నిజమే పెద్దమ్మా! మేము నీకు సాయం జేస్తే దేవుడు మాకు సాయం జేస్తడు గదా!"

పక్కనున్న పటేల్‌పురా సందులో గాజులు, హారము చేతులు మారినై. నాగమ్మ నవ్వుతూ వెళ్లిపోయింది.

"హమ్మ! ముసల్డి జల్డి బుట్టల వడ్డదిరా!" యాదగిరి చంకలెగిరి పడినై.

'వెండి గొలుసుకు బంగారుపూత పూయించినం గదా! ఆ హారన్ని బ్రహ్మదేవుడు గూడా గుర్తుపట్టడు. పద మార్వాడీకమ్మేద్దా మీ గాజులు హబ్బా! పాత బంగారం ... సోక్కం బంగారంరా!"

* * * * *

"మా అమ్మ దవాఖానలుంది సేఠ్‌జీ. మందులకు పైసల్లేవు. అందుకని అమ్ముతున్నం" బ్రహ్మాండంగా బాధపడ్డారిద్దరూ.

గాజుల్ని అటుతిప్పి, ఇటుతిప్పి, రాయిమీద రాసి పరీక్షలు పూర్తి చేశాడు మార్వాడి.

"డబ్బు తెప్పిస్తా బైఠో...." లోపలికెళ్ళి రెండు నిముషాల్లో వచ్చాడు. "మావోడిని బాంకుకు పంపిన." అని మాటల్లోకి దింపాడు.

పది నిమిషాలైందో లేదో బూట్ల టకటకలు. లాఠీలు తిప్పుతూ పోలీసులు దిగారు. మార్వాడి పళ్లు పటపటలాడినై.

"గీ బద్మాషులే సార్. గిల్టు గాజులు దెచ్చి బంగారమని అమ్ముతున్నరు. నాకే టోపీ వెయ్యాలనుకున్నరు. బొక్కల పడేసి బొక్కలిర గొట్టుండ్రి దొంగనాకొడుకుల్ని" గాజుల్ని ఇద్దరి మీదికి విసిరేశాడు మార్వాడీ.

యాదగిరి, బలరాంల గుండెల్లో గజదొంగల పరుగులు.

"హమ్మ నా ముసలిముండా! ఎంతపంజేస్తివే!" అంటూ తప్పించుకోబోయిన యాదగిరి గల్లా యస్సై చేతికి చిక్కింది.

"వావెమ్మా! గిట్లెన్నడూ గాలేదురా! నమస్తే సార్."

పారిపోబోయిన బలరాం జుట్టు కానిస్టేబుల్ పిడికిట్లోకొచ్చింది.

(మూసీ-అక్టోబర్ 1998)

# భూకంపం

"స్వీయ కవితలు రేడియోలో ప్రసారం కావడమంటే మాటలా మజాకా! మనవాడు మన పటేల్‌పుర వీధి పరువు పెంచేస్తున్నాడురా!"

"నేను ముందే చెప్పిన, మనవాడెప్పుడో ఒకప్పుడు మహాకవై పోతాడని"

"నేటి మన రేడియో కవి రేపటి సినిమా కవి"

"నేటి పారుపల్లి వీధి కవి రేపటి ప్రపంచకవి"

కాయితాలు ఖరాబు చేస్తాడని అప్పుడు దెప్పి పొడిచాం గానీ ఇప్పుడు చూడండ్రి మనవాడెంత ఎదిగిపోయిండో!"

మిత్రుల ప్రశంసలు మల్లేశ్ గుండెల్లో మల్లెపూల జల్లులు కురిపిస్తున్నాయి. పెదాల మీద చిరునవ్వు చిందులేసింది. పది నెలల క్రితం ఆకాశవాణికి పంపిన పది కవితల్లోంచి ముచ్చటగా మూడు కవితలు ఎంపికైనాయి. పది రోజుల క్రితం రికార్డింగ్ పూర్తయింది. ఈరోజు రేడియోలో తన గొంతు వినబడబోతుంది.

.... ఆనందం అందలమెక్కించింది. ఉల్లాసం ఉరకలు వేసింది. విజయ గర్వం ప్రచార కార్యక్రమానికుసిగొల్పింది.

ఆ రోజు సాయంత్రం ఆరున్నర నుండి ఐదు నిమిసాల పాటు రేడియోలో మల్లేశ్ స్వీయకవితల ప్రసారం. కమ్మని కవితాగానానికి ముందు తియ్యని అల్పాహారం విందు. ఆహ్వానం అందుకున్న బంధు మిత్రులు సకుటుంబంగా సపరివారంగా వేంచేశారు. ఇంటికి పేరంటం కళ వచ్చేసింది.

వరండా ముఖ భాగములో తళతళలాడే ప్లైవుడ్ టేబుల్ రాజాస్థానములో సింహాసనం లాగుంది. దాని మీద కొత్త సెల్సులు బిగించిన బుల్లి రేడియో మిలమిల్లాడుతోంది. టేబుల్ ముందు నాలుగు వరసల్లో కుర్చీలు. ఆడ, మగ శ్రోతలు చెరో రెండేసి వరుసల్లో ఆసీనులైనారు. మగ శ్రోతల మధ్యలోంచి మల్లేశ్ వీడియో ఆపరేటర్‌కు సూచనలిస్తున్నాడు. ఆడ శ్రోతల మధ్యన శ్రీమతి మల్లేశ్ పట్టుచీర ఫెళఫెళలు... ఆవిడ హడావుడి అంతా ఇంతా కాదు.

హాయి గొలిపే ముచ్చట్ల మధ్య స్వీటు, ఖారా, చాయ... అల్పాహారం విందు ముగిసింది. టైం ఆరూ ఇరవయ్యేదు. పెద్దల సైలెన్స్ సైగలతో టేం వనంలో వెలసిన వానలా కలకలం తగ్గుముఖం పట్టింది. రేడియో ఆన్ చేశాడో మిత్రుడు. టైం సరిగ్గా అరున్నరైంది.

"మల్లేశూ.... అరే నాన్నా మల్లేశూ... ఎంత పని జరిగిపోయిందిరా తండ్రీ..."

"ఇదేమిటీ... మల్లేశ్ గొంతు గిట్లుందా?" ఆశ్చర్యంతో తలమునకలయారంతా.

"ఈ సంగతి విన్నావురా నాయనా...!" రేడియో వెనక నుండి మల్లేశ్ నాయనమ్మ ప్రత్యక్షమైంది.

"కవితానందములో మొదట... రేడియో దారి రేడియోది. సౌండ్ ఎంత పెంచినా నానమ్మ సౌండ్ దాన్ని ఓవర్‌టేక్ చేసేస్తోంది. మల్లేశ్‌లో ఆగ్రహం అంగలేసింది.

"అబ్బా... రామాయణంలో పిడకల వేటలా నడుమ నువ్వెందుకే... నువు జెర ఆగవే అమ్మమ్మా!" శ్రీమతి మల్లేశ్ గొంతు చించుకుంది.

ముందున్న వాళ్లగ్గూడా రేడియో విన్పించడం లేదు.

"ముందు నా మాట వినురా... లేకపోతే మరిచిపోతాను..." నానమ్మ గొంతు కీచుమంది.

"అయ్యో... ఇప్పుడు నా కవిత్వం రేడియోలో వస్తుందే... జుట్టు పీక్కున్నాడు "కొంచెంస్సేపాగవే!"

"పైత్యం చేసి వాంతులైతున్నాయా? ఎవరికిరా? నీకా, నీపెళ్ళానికా?" ఆందోళనతో రెచ్చిపోయింది నానమ్మ. గుచ్చి గుచ్చి అడిగింది. కాస్సేపు వాగ్యుద్ధం శ్రోతల్లో కలకలం.

"అయ్యో! ఇదేమిటమ్మమ్మా!" శ్రీమతి మల్లేశ్ చిరాగ్గా ముందుకొచ్చి మసలావిడ చేతులు పట్టేసింది. నేరస్థురాలిని లాకప్‌లోకి లాక్కెల్తున్న పోలీసులా పక్కకు తీసుకుపోయింది.

ఇప్పుడు రేడియో వినబడుతుంది, కలకలం ఆగిపోయింది.

"ఇంతవరకు శ్రీమల్లేశ్ గారి స్వీయ కవితలు విన్నారు. ఇప్పుడు..."

రేడియో ప్రకటన.

"బాగుంది. ప్రోగ్రాం చాలా బాగుంది"

"ఇలాంటి ప్రోగ్రాం ఎప్పుడూ వినలేదు. కనలేదు."

లేచిపోతున్నారంతా.

పిచ్చెత్తినట్లైంది మల్లేశంకు నెత్తినెక్కబోయిన వజ్రాల కిరీటం నేల పాలైనట్టనిపించింది.

"ఇంతకీ నీ సంగతేమిటే నానమ్మా?" అడిగాడు కుక్కర్‌లో కూరలా ఉడికిపోతూ.

"జపాన్‌లో మళ్ళీ భూకంపవెుచ్చిదట్రా నాయనా! మధ్యాహ్నం టీ.వి.లో చెప్పింద్రురా" నానమ్మ మొహం పగిలిన దానిమ్మ పండులా విచ్చుకుంది." అన్నట్టూ ... ఒక్కరు గూడా చావలేదట్రా. ఈ సంగతి నీకు చెప్పాలని ఎప్పట్నుంచో అనుకుంటున్నా. ఇప్పుడు దొరికింది సమయం.. "ఇంకేదేదో చెప్పుకుపోతోంది. అందుకని నువ్విక్కడ, ఇప్పుడు భూకంపం సృష్టించినవా..." ఏడుపొస్తోంది. చొక్కా చించుకోవాలో, చెప్పుతో కొట్టుకోవాలో అర్థంకాలవడం లేదు.

"బంగారం లాంటి ప్రోగ్రాంలో భూకంపం లేపావు గదే నానమ్మా ..." గోడు గోడుమన్నాడు. (మూసీ-ఏప్రిల్ - 1998)

# దొంగకుట్టిన తేలు

మే మాసం సూర్యుడు ఉగ్రరూపం ఉపసంహరించి గంట క్రితమే ఇన్స్పెక్షన్ బంగళామీద మాయమైనాడు. బంగళా పక్కనే ఉన్న కోమటి చెరువు అలల గాలులు ఒంటికి హాయినిస్తున్నాయి.

ఇన్స్పెక్షన్ ముగించుకొచ్చి బంగళాలో జీబుదిగేప్పుడు కంటబడి కలవరపెట్టిన మెరుపుతీగ అరవింద్ ఎదలో గిలిగింతలు పెడుతోంది.

"సార్! భోజానికెల్దామా?" అడగలేక అడిగాడు స్టెనో గ్రాఫర్.

మూడు పదులు దాటని వయస్సులో మురిసిపోతున్న అరవింద్ చూపులు బంగారు గొలుసులో బిగించిన చేతి గడియారం మీదికెళ్లాయి. ఎనిమిదైంది.

"నేనిప్పుడు రాలేను. మీరెళ్ళిరండి. జీబు తీసుకెళ్ళండి" అంటూ వరండాలోకి చూస్తూండి పోయాడు.

జీబ్ వెళ్ళిపోయింది. హమ్మయ్య ... డ్రైవరు గూడా లేడు. లోపలికెళ్ళి సోఫా నాక్రమించాడు.

అరవింద్‌లో ఆరాటం పెరిగింది.

ఆ.... మెరుపు తీగ ఎక్కడా!"

"మంచినీళ్ళుసార్... మా నాయిన వాచ్‌మెన్..." తియ్యని గొంతు.

అదే మెరుపుతీగ, హంసలా అడుగులేస్తూ వచ్చింది.

వెరీనైస్.... పల్లెటూరి పిల్లే. పిటపిట లాడ్తోంది. తెల్లని కుబుసంలాంటి ఓణీ...ఊరించే అంగసౌష్టవం... ట్యూబ్‌లైటు వెలుగును మించిన కాంతి ఆమె కళ్ళల్లో ఉంది.

"నీ పేరేమిటీ?" సగం కాల్చిన సిగరెట్ పీక నులిమిపారేశాడు.

"నా.... పే....రా! నాపేరు.... మయూరి సార్!"

మొహం ముద్దబంతిపూవులా విచ్చుకుంది.

ఆహా.... సార్థక నామధేయురాలు! "పేరు చాలా బాగుంది."

"ఇక్కడ వెడ్తున్నాసాన్!" జగ్గుటేబుల్ మీదుంచి

"నేంబోతున్నా సార్!" వెనుదిరిగింది.

"నువ్వు చాలా అందంగా... అంటే దేవకన్యలాగున్నావ్ మయూరీ!"

గుటకలువేస్తూ అభినందనాస్త్రం వేశాడు.

"హాయ్.... నిజంగానా సారూ?"

తన ఒళ్ళు తానే చూసుకుని ముడుచుకుపోయింది.

మయూరి ముందు కొచ్చాడప్పటికే.

"నిజంగా... నిజం మయూరి..." మయూరి వీపు నిమిరి కళ్ళల్లోకి చూశాడు.

"గిదేంది సారూ!" బుగ్గలు ఎర్రగులాబీలైపోయినై. పక్కకు జరిగి మూతులు తిప్పింది.

"ఏం లేదు మయూరి! నీకు మా డిపార్ట్‌మెంటులో ఉద్యోగమిప్పిస్తా.... చేస్తావా?"

"నాకా... సర్కారు నౌకరా....!" కళ్ళు అరచేతు లంతైనై... కిలుక్కున నవ్వింది. ఆ నవ్వులో వెన్నెల వెలుగుంది.

"ఔను... నీకేఔ" అరచేతుల్తో చెంపల్ని నిమిరాడు.

"అబ్బ!.... గీ గడియారం... శానబాగుంది. నా చెయ్యిమీద ఎట్లుంటదో!" గడియారాన్నీ, చెయ్యినీ ముద్దుబెట్టుకుంది. మయూరి పెదాలు వణికినై. శ్వాసగాలి అరవింద్ చేతికి చల్లగా తగుల్తోంది.

"పెట్టుకుని చూడు!" తీసిచ్చాడు గడియారం.

"గీ ఉంగురం గూడా....!"

"ఇదిగూడా పెట్టుకో కాస్సేపు" తీసిచ్చాడు.

"హబ్బ.... నా చెయ్యి... బంగారమోలె ఉంది గదసారూ!" కళ్ళు చక్రాల్లా తిరిగినై. దోరమాగిన మామిడిపండు దోసిట్లో కొచ్చినట్టైంది అరవింద్‌కు.

"ఆహా.... అందమంటే నీదే సుమా!" అమాంతం చేతుల్లోకి తీసుకుని గుండెలకు హత్తుకోబోయాడు.

"మయూరీ... ఓ మయూరీ!" బయటి నుండి పిలుపు.

"అబ్బో... మా అక్క పిలుస్తుంది."

సీతాకోకచిలుకలా తుర్రుమంది మయూరి.

* * * * *

"మీ గడియారమేదండీ?" క్యాంపునుండి తిరిగొచ్చిన భర్తనుండి బ్రీఫ్‌కేసందుకుంటూ అడిగింది అమల.

ఏం చెప్పాలి?.... తేలు కుంటిన దొంగయ్యాడు అరవింద్.

గబగబా డ్రెస్సు మార్చుకుని బాత్రూంలో చొరబడ్డాడు.

"గడియారమండీ... గడియారం. పోయిన సంవత్సరం మన పెళ్లిలో మానాన్న బంగారం గొలుసు చుట్టించి కట్నమిచ్చిన గడియారం. అరె.. ఉంగరం గూడా లేదే!" ఒక చేత్తో కాఫీ కప్పు అందిస్తూ మరో చేత్తో భర్త ఉంగరం వేలందుకుంది.

"అవీ.... అవి..." నాలుక కింద నీళ్లూరుతున్నై. కాఫీ గడగడా తాగేశాడు.

"బ్రీఫ్ కేసులో ఉందా?"

"క్కా.... కాదు సిద్ధిపేటలో పోయినై అమలా!" భార్యకళ్ళలోకి బలవంతంగా చూశాడు.

"ఎలా?" కనుబొమ్మలు ముడిపడినై.

"ఎక్కడో పడిపోయినై."

"నిలువు దోపిడీ జరిగిందన్న మాట!"

"ఆ... అంతే... అహ...కాదు..పడిపోయినై." జైలుకు వెళ్ళుతున్న నేరాస్థుడిలా తల నేలకు వేలాడింది..

"ఐతే... బుద్ధి గడ్డితిన్న దన్నమాటా!"

"అబ్బా... నేనేం చెయ్యాలి అమలా!"

"ఏం చెయ్యాలా! పరాయి ఆడవాళ్ళను అక్కా చెల్లెళ్ళుగా చూస్తానని ఆ రోజు ... నా బుగ్గగిల్లి మరీ చెప్పారు గదా! ఆమాట మీదుండాలంటాను."

"అబ్బా... దానికీ దీనికీ సంబంధమేమిటటా?" రోషం పాలపొంగులా వచ్చింది. చటుక్కున్న తల పైకెత్తాడు. ఆశ్చర్యం.

"నాకు నౌకరిప్పిస్తారా సారూ! ఇంగో మీ గడారం ఉంగురం...." పక పకా నవ్వుతోంది మయూరి.

అదే మయూరి... కాని వేషం.

"నమస్తే బావా! నా పేరు మయూరే... వాచ్‌మెన్ కూతుర్ని కాదు. అమలక్క మా పెద్దమ్మ కూతురు. మీ పెళ్ళప్పుడు డిగ్రీఫైనల్ పరీక్షల్లో ఉన్నాను. పావం! మా అమలక్క మొగుడు అపరఋష్యశృంగుడను కున్నాను..."

పగలబడి నవ్వుతున్నారు అమల, మయూరి.

"మరీ.. మరి.... అక్కడ నిన్ను పిలిచిన మీ అక్కా..."

"మా అమలక్కే బావా! మాది సిద్ధిపేటనేటట్టడాం...!"

దొంగకుట్టిన తేలైపోయిన అరవింద్ మొహం చూడముచ్చటేసింది అక్కా చెల్లెళ్ళకు.

(అమృత్ కిరణ్ - 16-3-1995)



# అర్ధ మొగుడు

తమ్ముడు రాసిన ఉత్తరాన్ని తనివి దీరా చదువుకుంది జాంబవతి. మొహం మొగిలిపూవైంది.

"ఆ ఉత్తరాన్ని ఎన్నిసార్లు చదువుతావు జాంబూ!" వెనక నుండి ఎప్పుడోచ్చాడో తెలీదు.... భర్త కృష్ణమూర్తి చేతులు నడుమును చుట్టేశాయి! తియ్యని పులకింత.

కోటీశ్వరుని కూతురు జాంజవతికీ, కేంద్రప్రభుత్వోద్యోగి కృష్ణమూర్తికీ మూడేళ్ళ క్రితం ముడి పడింది. రాఘవేంద్రనగర్ వీధిలోని అద్దింటిలో సెటిలైన ఆ చిలకా గోరింకలు అప్పుడే పిల్లా పీచు వద్దనుకున్నారు.

"మీకూ ఓ తమ్ముడుండి, అతగాడు ఢిల్లీలో జాబ్ చేస్తూ మీకో జాబురాస్తే తెలిసుండేది..." బుంగ మూతితో వెనక్కు తిరిగింది.

"అబ్బో... చిరుకోపం నీ అందాలను వందరెట్లు చేసిందోయ్!" సిగ్గుల బుగ్గల్ని పెదాలతో తడిపేశాడు. ఎవరన్నా చూస్తారేమోనని కష్టంగా ఉన్నా, అది ఇష్టంగానే ఉంది జాంబవతికి.

హఠాత్తుగా భర్త కళ్ళలోకి చూసింది. ఎప్పట్నుండో ఎదను తొలిచేస్తున్న స్త్రీ సహజమైన అనుమానం తళుక్కుమంది బుర్రలో.

"ఏమండీ.... మీకూ... వేరే అమ్మాయిల్తో పరిచయాలున్నాయా?" గోముగా అడిగింది.

"పరిచయాలా! ఎందుకుండవ్ ... చాలా ఉన్నాయి."

జారుడు బండమీంచి జారిపడినట్టన్పించిది.

"అమ్మో అమ్మో.... ఐతే నా కాపురం కోమటిచెరువై పోతుంది. దేవుడోయ్....!" గుండెలు బాదుకుంది. మొహం కందిపోయింది.

"పరిచయాలంటే... మామూలు పరిచయాలే జాంబూ!" ప్రణయం ప్రళయంగా మారకముందే చల్లగా జారుకోవడం క్షేమ మన్పించింది.

"సరే.... నేను ఆఫీసుకెళ్ళున్నా.... తలుపేసుకో!" వెనక్కి తిరిగి చుడకుండా వెళ్ళిపోయాడు.

"మా శ్రీవారు అపర శ్రీరాముడనుకున్నానే....!" సోఫాలో కూలబడింది. అరచేతులు గడ్డానికతుక్కు పోయినై. బుర్రనిండా చింపిరి ఆలోచనలు, చిల్లెర ఊహలు.

ఎదురుగా గోడకు వేళ్ళాడుతున్న శ్రీకృష్ణ రాసలీస పటం పిచ్చెకింస్తూంది

"రాఘవేంద్రనగర్...ఘర్ నెంబర్ సోలా...యహీహైనా... ఇదేనా?" అందాల బరిణ ఒకతి నేరుగా ఇంట్లో కొచ్చేసింది.

అపిల్ పండు దేహఛాయ, గుండ్రని మొహం, చెంపలకు చారెడెసి కళ్ళు... రెండు కలువల మధ్య నిండుగా ఉదయిస్తున్న బాలార్కుడిలా, రెండు కళ్ల మద్య ఎర్రని కుంకుమ బొట్టు... మంచి అందగత్తె.

జాంబవతి మనసు కల్లుదాగిన కోతైంది.

"అనుకుంటున్నా... ఎవతో కొంపమీది కొస్తుందని.... వచ్చావా... దా, నీ కాళ్ళిరగొడ్తా.... ఎవతివే నువ్వు?"

"మేరా నామ్... నా పేరు....!" చెప్పబోయింది.

"ఏ పేరైతేనేం? మా వారిని బుట్టలో వేసుకుంది గాక ఇంటి మీదికి రావాల్నా? వెళ్ళెళ్లు!"

"అబ్బే .... నేనూ... మీ...." అందాల బరిణ అయోమయం.

"నాకింకేమీ చెప్పొద్దు, పో...గెటౌట్ బద్మాష్!" దిగ్గున లేచి గొంతు చించుకుంది.

గుండెలెగిసి పడ్తున్నై కళ్ళు చెమ్మగిల్లినై. ఆ అమ్మాయి వెళ్ళిపోయింది.

హమ్మో... మొగబుద్ధి మొరటు బుద్ధి అంటే ఏమితో అనుకున్నా... మళ్ళీ సోఫాలోకి జారుకుంది.

ఎందుకైనా మంచిది, తలుపులు వేద్దామని లేచి ముందుకు కదిలింది. తుమ్మమొద్దులా గున్నాడెవడో.... మొహం బొగ్గు ముద్దలాగుంది. తెరిస్తే గాని నోరెక్కడుందో తెలిసేట్టులేదు... లోపలికొచ్చేస్తున్నాడు. మొదట భయమేసింది. ఆ తర్వాత దైన్యం ధైర్యంగా మారింది.

"ఎవర్రా రౌడి వెధవా!" ఒక్క తన్ను తన్నింది. కాలేజీలో నేర్చుకున్న కరాటే ఇప్పుడు పనికొచ్చింది. తలుపులు వేసొచ్చి టీ.వి. ముందు కూచుంది. అల్లకల్లోలమైన అంతరంగానికి తెలుగు ప్రోగ్రాం రుచించలేదు. టక్కున టీ.వి. ఆపేసింది. ఎవరో తలుపు తడుతున్నారు. ఐతే మళ్ళీ వాడే వచ్చుంటాడు వెధవ! నా తడాకా చూపించాలి. గబగబా వెళ్ళి తులుపుతీసింది. గల్లా బట్టి లోపలికిలాక్కొచ్చింది. గుద్దు గుద్దాలని చెయ్యెత్తింది. అతడు ... వాడు కాదు.

"ఇదేంది జాంబూ! నేను ... నీ మొగుణ్ణి" సింహం చేతిలో చిట్టెలుకలా వణికి పోతున్నాడు కృష్ణమూర్తి.

జాంబవతి గుండె జారింది. గల్లా వదిలేసి మంగళ సూత్రాలు కళ్ళకందుకుంది. చేతులు పట్టుకుని, "అయ్యో... అదేమిటండీ, మీ మొహం నిండా రంగు... డ్రెస్సునిండా....!" బేజారైపోతుంది.

"ఈ రోజు హోలీ కదా! మాకు సెలవు లేదాయె. ఆఫీనుకెల్తాంటే... ఇదీ గతి! ఐనా.. నువ్వీ రోజు అపరకాళీవైపోయావేమిటీ?" గాలికి కొట్టుకుపోతున్న గడ్డిపోచలా వెళ్ళి సోఫాలో కూలబడ్డాడు.

"అయ్యయ్యో... పోయపాటై పోయిందండీ..." బతిమాలింది. కృష్ణమూర్తి కూలై పోయాడు. జాంబవతి కప్పుడు గుర్తుకొచ్చింది....

"అరెరే... మా తమ్ముడూ, మరదలూ ఈరోజే వస్తాడని రాశాడు గదండీ. ఇక్కడెవరికీ తెలికుండా వాడా హర్యానా అమ్మాయిని ప్రేమించి పెళ్లిచేసుకున్నాక మనమే రమ్మని రాశాం గదా! వాళ్ళొట్లొస్తారో! ఈ రంగుల పండుగ ఏంజేస్తుందో...!"

"అనుమానం ముందుబుట్టి ఆడది తర్వాత పుట్టిందని అందుకే అన్నారేమో! మీ తమ్ముడూ, మరదలు వచ్చేశారు. నీ దెబ్బకు బయటపడున్నారు పోయి చూస్కోపో...!"

బయటికెళ్లి తుమ్మమొద్దనూ, అందాల బరిణనూ తీసుకొచ్చింది.

"ఈ రోజు హోళీ అని మరిచావ్రా మధూ! కొత్త పెళ్ళికూతుర్నికూడా తరిమేశావ్రా!" తమ్ముని చేతులు పట్టుకుంది.

ఢిల్లీ జంట గుండెలనిండా ఊపిరి పీల్చుకుంది.

"పోనీలే అక్కా.... మా బావగారు రాకపోతే బైకారైపోయేది!"

"నమస్తేజీ... మెరానామ్ రాధాబాయి. మీ మరదల్ను. తెలుగు కొద్దిగా తెలుసు. ఢిల్లీలో తెలుగు గల్లీలో ఉన్నాం...!" అందాల బరిణ చేతులు జోడించిది.

"ఛీ పాడుపని చేశానమ్మా... పొరపాటైంది మరదలా" చేతులు చాచింది.

"అదేం కాదు, మీరు మేరీ ఆడబిడ్డగదా! అర్ధమొగుడనిపించుకున్నారు." ఆడబిడ్డ ఒడిలో ఒదిగి పోయింది.

నవ్వుల పూలజల్లు కురిసింది. వెల్లువైపారింది.

(అమృత్ కిరణ్ - 1-4-1995)

# ఆశ

శరభేశ్వరాలయం వద్ద లోకల్ బసెక్కి పి.జీ. సెంటర్లో దిగింది శివాని. కాలేజీలో ఆమెను బ్యూటీ క్వీన్ అంటారంతా.

అప్పుడే హీరో హోండా దిగిన అమరేందర్... అదే ఆవిడ క్లాస్‌మెట్... కంటబడగానే మనసు చిందరవందరై పోయింది.

కోటీశ్వరుని ఏకైక సంతానం అమరేందర్. వంకీల జుట్టూ, పొడగాటి చేతులూ, పొడగాటి ముక్కూ , వసందైన మీసకట్టూ, ఖరీదైన సూటూ... గబగబా ఎదురెళ్ళింది.

"హల్లో అమరేందర్!" ఓ చిరునవ్వు పారేసింది.

"నా అందచందాలన్నీ నీవే..." అందామనుకుంది.

కాని అప్పటికే అతడు హలో!" అంటూ ముందుకెళ్ళి స్నేహితుల్లో కలిసిపోయాడు! మనస్సు చివుక్కుమంది.

కింది పెదవి మునివళ్ళ మధ్య ఇరుక్కుపోయింది. ముంగురుల్ని సర్దుకుంటూ క్లాసు వైపు నడిచింది.

ఏదన్నా రూటు వెతకాలి. అమరేందర్‌కు దగ్గరవాలి. అతని ఎదలో తన ఒంపుసొంపుల విత్తనాలు చల్లి ప్రేమ పంట పండించాలి. కోటీశ్వరుని కోడలినైపోవాలి... స్వర్గసుఖాలనుభవించాలి... ఊహల ఊసులు... ఉడుం పట్టు పట్టుమన్నాయి.

అదే రోజు సాయంత్రం అమరేందర్ గదిలో ఒంటరిగా ప్రత్యక్షమైంది. నవ్వుతూ పలుకరించింది. లోకాభిరామాయణం తర్వాత జోకభిరామయణం లోకి దింపాలనుకుంది. కానీ ఇప్పుడే అన్నీ ఒలకబోస్తే బావుండదనిపించింది.

మరో రోజెళ్ళి బోలెడన్ని జోకులు జోకేసి నవ్వించింది. మాటల్లో మ్యాజిక్ చూపించింది. పగలపడి నవ్వారిద్దరూ. నెలరోజుల్లో చేతిలో చెయ్యేసి నడిచింది. విజయం చేరువలో ఉందనుకుంది.

"రోజూ సాయంత్రం అలస్యంగా వస్తున్నావేమిటీ!" ముక్కుమీద వేలెసుకొని మందలించిందోసారి తల్లి.

"మాది చాల ఎద్ద కోర్సమ్మా. రోజూ ప్రైవేట్ క్లాసులే. నేనేం చేయాలీ?" కొట్టిపారేసింది.

ఓ రోజు కోమటిచెరువు గట్టుమీద జంటగా నడిచింది. అతని భుజాలమీద చేతులేసి....

"నన్ను మీ ఊరు తీసుకెళ్ళవా అమర్?" అడిగింది కలువ కళ్ళను కమ్మగా తిప్పుతూ.

"తప్పకుండా... రేపే వెళ్తాం నాబండిమీద." అనేశాడు శివాని గుండెల్లో శివరంజని పలికింది.

అనుకున్నట్టుగానే మర్నాడు హీరో హోండా మీద ప్రయాణం. అరగంటలో ఊరొచ్చింది. హీరోహోండా హీరో - హీరోహిన్‌లను మెస్తున్న పుష్పకవిమానంలాగన్పించిదామెకు. మనసు మబ్బుల్లో తేలి ఆడింది.

అమరేందర్ ఇల్లు. మూడంతస్తుల బంగళా అమరపురిలాగుంది. రాజసం ఉట్టిపడుతోంది చేతిలో చెయ్యేసి వెంట నడిచింది. అమరేందర్ తల్లిదండ్రులు ఎదురొచ్చారు నవ్వుతూ...

"ఈ అమ్మాయెవరూ!" అడిగింది తల్లి. తండ్రి అత్రంగా. కళ్లనిండా ఆసక్తి. కడుపులో అయోమయం.

శివాని గుండెపొరల్లో సంతోష తరంగాలు.

"ఈమె పేరు శివాని. నా క్లాస్‌మేటు. చాలా మంచిపిల్ల. చలాకీగా ఉంటుంది. అందరితో కలుపుగోలుగా ఉంటుంది" పరిచయం చేశాడు.

"మరి..." ఏదో అనబోయాడు తండ్రి.

"ఈమె నాకు చాలా దగ్గరైంది నాన్నా!"

"అం.... టే....!"

"ఈ శివాని నాకు దేవుడిచ్చిన చెల్లెలు. నాకు అక్కా చెల్లెళ్ళు లేరుగదా... కదా శివానీ!" శివాని కళ్ళలోకి చూశాడు. ఎయిర్ బస్‌లో ప్రయాణిస్తూ ఎడారిలో పడిపోయినట్టినిపించింది శివానికి. చటుక్కున పక్కకు జరిగింది. పెదాలమీద బలవంతపు చిరునవ్వు మెరిసింది.

"ఈ రోజు రాఖీ పూర్ణమ కదూ. రాఖీ కట్టించుకోవాలని తీసుకొచ్చావా! రామ్మా!" అప్యాయంగా భజం తట్టింది తల్లి.

(అమృత్ కిరణ్ - 16-10-1995)



# పున్నమి వెన్నెల

అర చేతిలో పాదరసంలా -వెంకటేశం మనసు పత్రిక మీద నిలవడంలేదు. గుండెనిండా వెన్నెల కదలాడుతోంది. మేలిమి బంగారు చెక్కిళ్ళు, తీర్చిదిద్దిన కనుబొమ్మలు, కువకువలాడే వయసు సొగసులు... వారం రోజుల క్రితం వెన్నెల జాయినవగానే ఆఫీసుకే కొత్త అందమొచ్చింది. తన ఎకౌంట్స్ సెక్షన్‌కే అల్లాటైంది. ఆకాశంనుండి దిగితున్న అందాల తారలా అడుగులో అడుగేస్తూ వయ్యారంగా వచ్చింది.

"నమస్కారమండీ అకౌంటెంట్ గారూ!" తనను కమ్మగా పలకరించింది.

అప్పుడామె కళ్ళు అలవోకగా కదుల్తుంటే లక్షల రూపాయల అరియర్స్ దొరికినంత ఆనందమన్పించింది.

కొత్తగా రిక్రూటై వచ్చిన కుందనబ్బొమ్మకు ఉద్యోగం కొత్త. పనికొత్త... తనకో సువార్ణావకాశం. పక్క సీట్లోనే కూర్చోబెట్టుకున్నాడు.

డౌట్స్ క్లియర్ చేస్తూ ఆమె కళ్ళలోకి సూటిగా చూడాలని ఎన్నిసార్లు ప్రయత్నించినా కుదరలేదు. జూకాల లావణ్యం తప్ప పెదాల కదలిక కనబడనీయలేదు. కళ్ళు కాయితాని కప్పజెప్పి చెవులు, తనకప్పజెప్పేది. కాని.... ఈ రోజు మాత్రం లంచవర్లో ఒంటరిగా కలిసింది. గలగలా నవ్వుతూ మాట్లాడింది.

రాత్రి ఎనిమిదింటికి తన ఇంటి డాబా పైకి డైరెక్ట్‌గా రమ్మంది. ఆ రోజు నిండు పున్నమి.

వెన్నెలలో వెన్నెలతో.. ఆహా! అదృష్టమంటే తనదే.

లాంగ్‌బెల్‌మోగింది. లైబ్రరీ మూసేస్తున్నారు... అంటే ఎనిమిదైందన్న మాట, గబగబా బయటికొచ్చేసి ఆటో ఎక్కేసి విద్యానగర్లో దిగాడు.

నిండు పున్నమి వెన్నెల-మచ్చలేని తెల్లని మఖ్మల్ గుడ్డలా డాబానింగా పరుచుకుంది.

ఆకుపచ్చ చీర, తెల్లని జాకెట్టు, జడనిండా మల్లెలు.... వెన్నెల అటు తిరగి ఆకాశం పైపు చూస్తోంది.

పాపం! తనకొరకే ఎదురు చూసోన్నటుంది. వెంకటేశం మనోసాగరంలో కొంటె కోర్కెల రాయంచ ఖుషీగా రెక్కలాడించింది.

పిల్లిల్లా వెళ్ళడం. నడుము చుట్టూ చేతులేసి గట్టిగా అదుముకోవడం... క్షణంలో జరిగిపోయినై. చెంప ఛెళ్ళుమంది. గుండె ఝుల్లు మంది.

ఆమె...

వెన్నెల కాదు.... పూర్ణిమ ... తన భార్య పూర్ణిమా. అబ్బా...చెంప మండిపోతోంది.

"అరెరే... మీరా! ఎవడో అనుకున్నరండీ!'' పూర్ణిమ కనురెప్పలు పూల మీది తుమ్మెద రెక్కల్లాటపటపలాడినై.

"ఆ నేనే! నువ్వెందుకొచ్చావిక్కడికి?'' అందోళన.

'వెన్నెల నా పాత స్నేహితురాలు. అది ఈ ఊరు వచ్చే ముందు నాకుత్తరం రాసి మన అడ్రసు కనుక్కొంది. సాయంత్రం మనింటికొచ్చి నన్నిటులాక్కొచ్చింది." అదిప్పుడే కిందికెళ్లింది.

"అలాగా....!'' కొండమీంచి జారి కోనేట్లో పడిపోయినట్టనిపించింది వెంకటేశంకు.

(అమృత్‌కిరణ్)

# అల్లం - బెల్లం

చలికాలం నీరెండ ముగ్గుల వాకిలని ముద్దాడుతోంది. మధ్యాహ్నం... పైరగాలి మనుషుల్ని పలుకరించి మనసుల్ని దోచుకుంటోంది. అయినా అమృతమ్మలో ఆందోళన పెరుగుతూనే ఉంది. మనసంతా కొడుకు మీదుంది. "మధురా! ఆనందు ఇంకా రాలేదేమిటమ్మా?" కోడలు నడిగింది. రూపాయి కాసంత బొట్టు చెమక్కుమంది.

"ఏమో అత్తయ్యా! ఆయన మొన్ననే రావాల్సింది. మీ అబ్బాయే ఘన కార్యాలు సాధిస్తున్నారో ఏమో...?" మధుర రుసరుసల్ని పట్టించుకోకుండా మూడు రాళ్ల, మూడు రంగుల ముక్కుపుడక తళుక్కుమంది. అది త్రివర్ణ పతాకం రెపరెపలాగుంది.

"గడప దాటితేచాలు... ఈ మొగాళ్లకు ఇల్లూ, ఇల్లాలు గుర్తుకురావు..."

"అందులోనూ మీ అబ్బాయైతే మరీ అన్యాయమత్తయ్యా!

"మనమెంత మొత్తుకున్నా ఏంలాభంలే! వాని కన్నీ మీ మామయ్య బుద్ధులొచ్చేసినై..."

గణేశ్ నగర్లో విలక్షణమైన ఇల్లు. విలక్షణమైన ఇంట్లో ...లక్షణమైన కుటుంబం. అది చిన్న కుటుంబం కాబట్టి చింతలు ...వనుకుంటారంతా. ఆరబోసుకున్న అనుభవాలను అనుభూతులుగా ...ర్చుకుని నెమరేసుకుంటున్న వెంకట్రామయ్య ఆ ఇంటి యజమాని ...తని ఏకైక సంతానమే ఆనందరావు - ఓ ప్రభుత్వోద్యోగి. వృత్తి ...భుత్వోద్యోగమైనా ప్రవృత్తి రచనా వ్యాసంగము...హాయిగా కవిత్వం ...స్తూ ఆనందనందన వనములో విహరిస్తాడు ఆనంద్ కవిత్వమంటే ...వికోసుకునే అభిమానులెందరో ఉన్నారు.

అంతటి ఆనందరావు ఆర్రోజుల క్రితం ఆఫీసుపని మీద హైద్రాబాదెళ్లి తిరిగి రాలేదింకా.

"అత్తా కొడళ్లంటే అమృతమ్మ - మధురల్లాగుండాలి." అనుకుంటారా వీధిలో.

"వీడెంత గొప్ప కవైతే మాత్రమేం లాభం? కన్నతల్లి, కట్టుకున్న పెండ్లా ఇంటి వద్ద కళ్లల్లో వత్తులేసుకుని ఎదిరి చూస్తుంటారనే ఇంగిత జ్ఞానం గూడాలేదాయ." గొణుక్కుంది అమృతమ్మ.

తనవంతు సణుగుడు ప్రారంభించబోయింది. మధుర... ఝామ్మని ఆటోవచ్చి ఇంటిముందాగింది. ఫుల్‌సూటులో, చేతిలో సూటుకేసుతో దిగాడు ఆనందరావు. అత్తా కోడళ్ళ మొహాలు అరవిరిసిన మందారాలైపాయిన్నె.

"మానాయనే...! అట్లా చిక్కిపోయావేమిట్రా?" అమృతమ్మ ఎదురువెళ్లి తోడ్కొని వచ్చింది.

"నేను దుక్కలా గున్నానమ్మా!" ఆనంద్ నవ్వేశాడు.

"మూడ్రోజుల్లో వస్తానని ఆర్రోజులు అటే పోతే మేమేనుకోవాలండీ?" అని మూతి ముడేసుకుని గదిలో దూరింది. మధుర.

"ఆఫీసు పనితోపాలు వేరే పనిగూడా ఉంది. అందుకే ఆగిపోయానమ్మా...." ఆనందరావు ఆనందాన్ని అలసట మింగేసింది.

సూటుకేసు టేబుల్ నాశ్రయించింది.

"మా ఆత్రుత అలాంటిదిరా! ఎప్పుడు బయలుదేరావో ఏమో... రా బోంచేద్దువుగాని..."

ఆహా! అమ్మ మనసు అమృతం.

"నాన్న లేడామ్మా!" అడుగుతూ సూటుకేసు తెరిచాడు.

"ఊళ్లు తిరగడమంటే మీ తండ్రీకొడుకులకు సరదాగద నాన్నా! ఎవరో బాల్యమిత్రుని కూతురు పెళ్లటా... పొద్దున్నే వరంగల్ వెళ్లారు. నువురా, భోంచేద్దువుగాని.." వెనక్కుతిరగబోయి మానుకుంది.

ఘల్లు ఘల్లు మంటు గజ్జల రిక్షా ఒకటి ఇంటి ముందు నుంచి వెళ్లి పోయింది. ఏమనుకుందో ఏమో... మధుర గది నుండి బయటి కొచ్చింది" రండి.. వడ్డిస్తా.... భోంచేద్దురుగాని." కాటుక కళ్లు కందిరిగల్లా కదిలాయి. భార్య మొహమ్మీదో చిరునవ్వు విసిరేసి. సూటుకేసులోంచి పొడవాటి పాకెట్ తీసి టేబుల్ సొరుగులో పెట్టేశాడు. అత్తా కొడళ్లనా దృశ్యం అబ్బుర పరిచింది.

"పొద్దున్నే టిఫిన్ అయింది కానీ..." అంటూ కాయితం పొట్లంతీసి తల్లి కందించాడు. పొట్లం విప్పుకుంది. అమృతమ్మ కళ్ళు ఆనంద జ్యోతులైపోయినై.

"ఆహా! జపమాలిక! మంచి రుద్రాక్షల జపమాల.... కళ్లకద్దుకుంది. కొడుకు హైద్రాబాదుకెళ్లేప్పుడు "హైద్రాబాదు రామకృష్ణ మిషన్లో మంచి జపమాలలు దొరుకుతాయట్రా ఆనందూ!" అన్న సంగతి గుర్తుకొచ్చింది అంబరాని కెగసిన సంబరంతో పూజాగదిలో కెల్తోంది. పాకెట్ కళ్లల్లో మెరిసింది. మనసులో ఏదో కలుక్కుమంది.

ఆ సొరుగులో దాచిన పాకెట్టులో ఏముందో! అదెవరి కోసమో!... కొండంత సంబరం కొండెక్కి పోయింది.

"ఇది.... నీ కోసం మధూ!" పూలదండ తీసి పెళ్లాం జడలో తురిమాడు. మల్లెల వాసన గుప్పుమంది. మధుర మనసులో మలయమారుతం వీచింది. దండ జడను గుండెలమీదికి లాక్కొని సవరించుకుంటోంది. ఎక్కడో ఏదో ముల్లులా గుచ్చుకుంది... ఆ సొరుగులో దాచిని పాకెట్లో ఏముందో! అదెవరి కోసమో! బుగ్గల మీది సిగ్గులు నుగ్గునుగ్గైపోయినై.

ఆ పాకెట్ వాళ్లమ్మ కోసమే అయుంటుంది. అందులో పట్టుచీర ఉండొచ్చు. బతుకమ్మ పండగనాడు అత్తయ్య "అన్నాళ్లు ఉద్యోగం చేసి రిటైరైనా... ఎన్నడన్నా నాకో పట్టు చీరకొనిపెట్టారా!" కన్నకొడుకు ముందు కట్టుకున్న మొగుణ్ని నిలదీసింది గదూ! దాని ఫలితమే ఆ ... పాకెట్ పట్టుచీర! కాని... తల్లికేదన్నా కొనివ్వాలంటే పెళ్లాం చాటుకే ఇవ్వాలా? నాగ్గూడా ఓపట్టుచీర కావాలని ఎన్ని సార్లడిగాను దేనికైనా ప్చ్.. ప్రాప్తముండాలి... కాటుక కళ్లల్లోంచి కాంతిరేఖలు మాయమైపోయినై.. మొహం ముకుళించుకుపోయింది. ఆనంద్ కాళ్ళన్యమేసింది.

"అదేమిటి మధూ! అలాగైపోయివేందీ?" కౌగిట్లో బంధించబోయాడు.

"ఎలాగైతే మీకేందటా!" మూతి మూడువంకలు తిరిగింది. వెంటనే మంచమీద మూడంకెవేసి అటు తిరిగింది.

"ఇద న్యాయం మధు! ఆర్రోజులు తర్వాత ఆవురావురు మంటూ వస్తే..."

"చాల్లెండి పెదాలమీది ప్రేమ. తల్లి అల్లం, పెళ్లాం బెల్లం అన్న సామెత తిరగబడింది గదూ!"

"నువ్వేమంటున్నావో నాకొక్క ముక్కగూడా అర్థంగాలేదు. కడుపులో ఎలుకలు చెడుగుడు ఆడుతున్నాయి పద మధూ!"

"అయితే ... మీ అమ్మగారి నడిగి ఓ పిల్లని మింగేయండి."

అడవాళ్ల మాటలకు అర్థాలే వేరన్నారు గానీ... ఈ విడ ఉద్దేశ్యమేమిటో అర్థమై చావట్టేదే!.

"దేవిగారు అలకపాన్పెక్కారెందుకో?" భుజాలు పట్టి ఇటు తిప్పాడు.

"దేవరవారి కరుణా కటాక్షవీక్షణాలకు తట్టుకోలేక... అయినా నేను అలకపాన్పెక్కితే మీకెందుకూ, నుటక మంచమెక్కితే మీకెందుకూ?" చేతులు ఝూడించిపారేసి అటు తిరిగింది.

* * * * *

అంత పెద్ద పాకెట్టును అందులో దాచెయ్యడం నేను చూడలేదనుకున్నాడేమో వెధవ! ఇంతకూ.. అందులో ఏముందో! పెళ్లాం కోసం పట్టుచీర కావచ్చు... అమృతమ్మ బుర్రలో ఏవేవో గిర్రురిర్రు మంటున్నై... బతుకమ్మ పడగనాడు పట్టుచీర కోసం వాళ్ల నాన్ననడిగానుగదా! అప్పట్నుంచే తనకే ముందు తెమ్మని వాణ్ని సాధిస్తుందేమో అ మహాతల్లి! కని పెంచిన తల్లి నోరుతెరచి అడిగింది గదాని నాగ్గూడా వాడో పట్టుచీర కొనిపెడితే తప్పా? పెళ్లాంకోసవ తెచ్చిన దాన్ని నేనెక్కడ చూస్తానోననవి చటుక్కున దాచేసుకున్నాడు... ఒరేయ్! నేను నీ అమ్మాన్నా!....

"అమ్మా! ఆకలేస్తుందే!" చిన్నపిల్లాడిలా వచ్చి అడిగాడు ఆనందరావు. అమ్మ మనసు ఆర్ధ్రమై పోయింది.

"అయ్యో... నాయనా... రా...రా!" చక చకా వడ్డించేసింది.

మొగుణ్ని కొంగుకు కట్టుకుని అదితే, ఇదితే అని అడగడం తెల్సుగానీ, ఆర్రోజుల తర్వాత గూడా మొగుడుకో అన్నంముద్ద పెట్టాలనే యావలేదు... కుతకుత లాడింది. పెరుగు వడ్డించేప్పుడు ఆ పాకెట్లో ఏముందో అడగాలన్పించింది కాని ఆమాట నాలుక దాకా రాలేదు.

ఇదేమిటీ! ప్లేట్లో అన్నం పెట్టి నప్పట్నుంచి భోజనం పూర్తయేదాకా ఏవేవో కబుర్లు చెబుతూండే అమ్మ... మౌన ముద్ర దాల్పిందెందుకో? ఆనందరావు కదోలాగాన్పించింది. దుక్కలా పెళ్లాముండగా ఒక్కచిక్కిన తల్లిని తిప్పలు బెడుతున్నావని నిరసనేమో!

కొత్త చుట్టాల ముందు మాటలు వెతుక్కుంటున్నాట్టు శూన్యంలోకి చూస్తున్న తల్లి ముఖ కవళికల్ని గమనిస్తూంటూ భోజనం ముగించాడు. ఈలోగా మధుర బయటి కొచ్చి టేబుల్‌సొరుగు లాగి చూడ్డం, పుల్లారెడ్డి నేతి మిఠాయిల డబ్బా చూసి "హమ్మా! ఎంతరుచిగా ఉంటుందో!" అనుకుని నోట్లో నీళ్లూరడం, నేనెక్కడ చూస్తానోననవి గబుక్కున ఇందులో దాచేశారు! పళ్లు కకొరుక్కోవడమై పోయినై.. మిఠాయిలు తల్లికే ఇవ్వాలా? పెళ్లాంకిస్తే పాపమా?.. గొణుక్కుంటుండగా ఆనందరావు బయటికొస్తున్న అలికిడి వినబడింది.

.. మల్లినాధసూరి టౌనుహాల్లో కవిసమ్మేళన ముంది, వస్తావా మధురా?" పెళ్లాన్ని ప్రసన్నం చేసుకోవాలనే ఆరాటం అడిగించింది ఆనందరావును.

హైద్రాబాద్ నుండి ఆలస్యంగా వచ్చినందుకు అత్తాకోడళ్లు యుద్ధం ప్రకటించారు. కాబట్టి ముందు అర్ధాంగిని చల్లబరచాలి ఆ తర్వాత ... అమ్మకోపమా! ఒడిలో తలబెట్టి మా మంచి అమ్మ అంటే సరి... అమ్మ కోపం హుష్కాకి...

మెుదటి కార్యక్రమంలో భాగంగా .. చిలిపితనం చెంగలించిందతన్లో.. మధుర పక్కన చేరాడు. నున్నని బుగ్గల మీద చేతివేళ్ళు సున్నితంగా పాకాయి. మధుర ఎదలో గిలిగింతలు... కాని ఇప్పుడే లొంగిపోతే... పాకెట్ పరమార్థం...?

నాలాంటి మొద్దావతారానికి కమ్మని కవిత్వం రుచిస్తుందా? మీ అమ్మను తీసుకెళ్లి హాయిగా ఎంజాయ్‌చెయ్యండి. రుసరుసల్లో మిళితమైన బుసబుసలు.

దెప్పిపొడుపు... ఆనందరావు పట్టుదలనుపెంచేసింది.

అబ్బా!అమ్మ కవిత్వం వింటుందా? నేను రాసిన ప్రతి కవితకు మొదటి శ్రోతవు, స్ఫూర్తి దాతవు నువ్వే గదా? స్ఫూర్తి దాత మారము చేస్తే నాపని నున్నా అవుతుంది. బుజ్జీ!" గదవ అందుకని బుజ్జగింపు సేవలో లీనమయాడు.

"ఏదో.. ఆ కవిత్వం అర్థమవుతుంది గానీ, మీ పైత్యాన్ని అర్థంచేసుకునే శక్తి సామర్థ్యాలు నాకున్నాయా?" చేతిని నిర్ధాక్షిణ్యంగా తోసిపారేసింది.

"నువ్వేం మాట్లాడుతున్నావో ఏమో!" అయోమయం అగాధాన్ని సృష్టించింది. చక్కిలి గింతలు, చెక్కిలి స్పర్శలతో మరికొంత ప్రయత్నం సాగింది. ఫలితం శూన్యం. అసహనం మేల్కొంది.

"టైమైంది నే వెల్తున్నా...!" దిగ్గునలేచాడు.

ఈలోగా.. అమృతమ్మలో ఆసక్తి పొంగిపొర్లింది. టేబుల్ సొరుగు లాగిచూసింది. మెదడు పొరల్లో తాజా ఆలోచనలు.

ఓహో! తల్లిచాటుకు పెళ్లానికి మిఠాయిలా! అందుకే అన్నారేమో.. తల్లి అల్లం, పెళ్లా బెల్లమని. ఈ మిఠాయి ఇంటిల్లి పాది తింటే బాగుండదా? తలాకొంత పంచితే అవిడకు తక్కువైపోతుంది గదా!.... ఆనందరావు అడుగుల చప్పుడు... సొరుగు మూసేసి సర్రున కుర్చీలో కూచుంది.

"నేనెళ్లొస్తానమ్మా!" అంటూ వెళ్లాడు బయటికి. అమృతమ్మ కదేదో కొత్తగా కన్పించింది కొడుకు ప్రవర్తన.

అరెరే.. తెగేదా కాలాగుతున్నానా? అయనేమనుకున్నారో ఏమో! తన ప్రవర్తన తనకే చేదనిపించింది మధురకు. లేచి బయటి కొచ్చేసింది. భర్త లేడు. బయట పక్కింటి పిల్లలాడుకుంటున్నారు.

ఎప్పుడూ తల్లీకూతుళ్లలా కలుపుగోలుగా మసలుకునే అత్తాకోడళ్లు మూగజీవులయారు మూతులు ముడేసుకుని టీ.వి. ముందు కూచున్నారు. భౌతికంగా బొమ్మల్ని చూస్తున్నా మానసికంగా ఎవరిలోకంలో వారున్నారు.

కవనవన విహారము కమ్మని అనుభూతినిచ్చింది.

ఆనందానుభూతిలో తేలిపోతూ ఆనందరావు ఇంటికొచ్చేసరికి రాత్రి తొమ్మిది దాటింది.

"హైద్రాబాద్ నుండి ఎప్పుడోచ్చావురా ఆనంద్?" తలుపు తీసిన వెంకట్రామయ్యలో పుత్రవాత్సల్యం పొంగింది.

"అప్పుడే వచ్చాను నాన్నా! మల్లినాథ సూరి టౌను హాల్లో కవిసమ్మేళనమైంది. దాంట్లో పాల్గొని వస్తున్నా... వరంగల్‌నుండి ఎప్పుడొచ్చావు నాన్నా?"

"నేనొచ్చి అరగంటయింది. హైద్రాబాదు విశేషాలేమిట్రా!"

అత్తాకోడళ్ల చెవులు తండ్రీకొడుకుల సంభాషణ మీదున్నై. పాకెట్ ప్రస్తావన ఎప్పుడోస్తుందాని ఎదిరిచూస్తున్నాయి.

కవిసమ్మేళనం విశేషాలు, వరంగల్ పెళ్లి విశేషాలతో పావుగంట గడిచింది. ఆ తర్వాత ఆనందరావు టేబుల్ సొరుగులాగి పాకెట్ బయటకు తీశాడు.

అత్తా కొడళ్ల ఒళ్లంతా కళ్లైపోయినై.

పాకెట్ విప్పుకుంది. విఠాయిడబ్బా మూత తెరుచుకుంది. మిఠాయిల వాసన గుమ్మనలేదు. చూపులన్నీ ఆనందరావు చేతుల మదున్నై. సినిమాలు వదిలినట్టుంది రోడ్డుమీద జనాల ముచ్చట్లు, నడకల చప్పుళ్లు.

"ఇది కాశ్మీరు శాలువా. నీకు బాగుంటుంది నాన్నా!" డబ్బాలోంచి శాలువా తీసి తండ్రి భుజాల మీద్దుంచాడు కొడుకు. గులాబిరంగు వులన్ శాలువా, చుట్టూ గోల్డ్ కలర్ తీగల అంచు... ఎంత బాగుందో!

బిత్తర చూపులతో అత్తాకోడళ్ల మొహాలు ఆరిపోయిన అగరొత్తులైపోయినై.

"ప్యూర్ వులన్! ఈ చలికాలంలో... వెచ్చాగా ఉందిరా!" మురిసిపోతున్నాడు వెంకట్రామయ్య.

"అది పుల్లారెడ్డి మిఠాయిల డబ్బా గదరా ఆనంద్!"

ఆశ్చర్యాన్నాపుకోలేక పోయింది అమృతమ్మ

"డబ్బా పుల్లారెడ్డి మిఠాయిలదే. శాలువా గూడా వారిదే. నిన్న సాయంత్రం హైద్రాబాద్‌లో జి. పుల్లారెడ్డి నేతి మిఠాయిల యాజమాన్యం వారు రవీంద్రభారతిలో కవి సమ్మేళనం నిర్వహించారు. నేను గూడా పాల్గొన్నాను. వారు కవులందరికీ ముందే మిఠాయిలు తినిపించి కవి సమ్మేనంలో కాశ్మీరు శాలువాలతో సత్కరించారు. తర్వాత వారి మిఠాయి డబ్బాలోనే శాలువా ప్యాక్ చేయించి యిచ్చారమ్మా! నా ఆలస్యానికి కారణం అది..."



# హైరన్

కోటిలింగేశ్వరుని కోవెలగంట శాంతినికేతన్ పి.జి. హాస్టల్‌లో మార్మోగింది. నాగరాజు పెదాలమీద నైట్ క్వీన్ నవ్వింది. పుస్తకం చేజారింది. నైట్‌క్వీన్‌ను చూడాలి గదూ!

గబగబా బయటి కొచ్చేశాడు. కిరణసముదాయాన్ని రెక్కలకింద దాచుకుని మాయమై పోతున్నాడు సూర్యుడు.

ఓహ్ నైట్‌క్వీన్ .... హౌస్వీట్ ఫారిన్ బ్యూటీ... ఎదలో గిలిగింత. ఎంత అందంగా ఉంటుందీ! గచ్చునేల మీది గచ్చకాయల్లా నీలంకళ్లు. తాకితే కందిపోయే నునుపుదేలిన శరీరం. నిన్ననే కాలేజీలో కనబడింది.

"హాయ్ మిస్!" అని పలకరిస్తే.

"హాయ్!" అంటూ చెయ్యూపింది. కలువుగోలుగా మాట్లాడింది. కళ్లు తిప్పుతూ కబుర్లు చెప్పింది.

వాళ్ళనాన్న పెద్ద ఇంజనీరట. ఐదేళ్ల కాంట్రాక్టు మీద అమెరికా నుండి ఆంధ్రాకొచ్చారట. హైద్రాబాద్‌లో ఉంటున్నారట. కావాలనే సిద్ధిపేట పి.జి. సెంటర్లో సీటు కావాలందట.

"నేను పి.జి ఫైనల్. హాస్టల్ ఉంటున్నా!" తన అడ్రసు చెప్పగానే...

"కోటిలింగాల గుడిముందు వీధిలో నాకో రూం దొరికింది." తన అడ్రస్ చెప్పేసింది.

కళ్ళను కలువల్లా కదిలిస్తూ.... నవ్వుతూ తనగదికి ఆహ్వానించింది. ఆ నవ్వులో నవరత్నాల మెరుపుంది. మెడలో కదిలే ఒంటిపేట గొలుసు... ఒంపుసొంపుల ఎత్తుపల్లాలను కొలుస్తోంది.

శాంతినికేతన్ దాటి రోడ్డుమీదికొచ్చాడు.

అమెరికా గర్ల్స్ చాలా ఫార్వర్డ్. డేటింగంటే పడిచస్తారు. ఖుషీగా ఉంటారు. నైట్ క్వీన్ చక్కని గర్ల్ ఫ్రెండ్. ఏమడిగినా సంకోచించదు.

"వెల్‌కం మైడియర్ కింగ్‌కోబ్రా!" చేతులు చాచి ఆహ్వానించింది.

నైట్‌క్వీన్ తెల్లని డ్రెస్సులో... అచ్చం నైట్ క్వీన్ పువ్వులాగుంది. నాగరాజు నరాల్లో మలయమారుతం గంతేసింది. చదువు సాగనంది. నిన్నటి పిలుపు గుర్తుకొచ్చింది...!

"వెరీవెల్! కమాన్ డియార్!" చెయ్యిపట్టి మంచమీద కూచోపెట్టింది. చెవుల రింగులు తళుక్కుమన్నై.

గది నీటుగా ఉంది. మంచం పక్కన గోడకు శ్రీరామ పట్టాభిషేకం కాలెండరుంది.

"తెలుగెప్పుడు నేర్చుకున్నట్టూ...!"

"డిగ్రీలో తెలుగు నా ఆప్షనల్ సబ్జెక్ట్ రాజూ!"

పక్కనే కూచుంది. భుజాలు రాసుకున్నై. నాగరాజు ఒళ్ళు జల్లుమంది. కొంటెకోరిక కొరకొరలాడించింది.

"ఇక్కడి వాతావరణ మెలాగుంది క్వీన్."

భుజమ్మీద చెయ్యేశాడు. సిరిమల్లెలా నవ్వింది. నాగరాజులో ఉత్సాహం ఉరుకులాడింది. ఒంటిరాయి ఆకుపచ్చ ముక్కపుడక తళుక్కుమంది.

"చీరలో మీరు చాలా అందంగా ఉన్నారు. సుమా!"

ఆమెవైపు తిరిగాడు.

"ఈజిట్!" నైట్ క్వీన్ గుండె నయాగరా జలపాతమైంది.

అతనివైపు తిరిగింది. భుజాలమీంది పైట జారింది. నాగరాజు గొంతు తడారిపోతోంది.

"ఈసిల్క్ పైట ఓపట్టాన నిల్వదు." సర్దుకుంది.

"వయసలాంటిది. ఐనా బాయ్‌ఫ్రెండ్ ముందు పైట లేకుంటేనే బాగుంటుంది. గదా!"

నడుమ్మీద చెయ్యేశాడు. అతని చెయ్యిని మర్యాదగా జరిపేసి సర్దుక్కూచుంది.

"మీరు ఫైనల్‌గదా... స్టడీ ఎట్లాసాగుతుంది రాజూ?"

"అబ్బా! స్వర్గానికెళ్లినా సవతిపోరు తప్పదన్నట్లు ఇప్పుడు గూడా స్టడీస్ గురించేనా?"

"మరి....?" ముడిపడిన కనుబొమ్మల మధ్య ఎర్రని బొట్టు హెచ్చరికలా మెరిసింది.

"లెటజ్ ఎంజాయ్ డియర్!" ఆవిడ నున్నటి భుజాలమీద చేతులేసి పెదాలందుకోబోయాడు.

"మిస్టర్ నాగరాజూ! వాటీజ్ దిస్?" దిగ్గున లేచింది.

"ఇది ప్రకృతి రహస్యం. మనిద్దరం....!" అతని అరచేతులు ఆవిడ బుగ్గల్ని నిమిరాయి.

"వాడ్యూయూ మీన్?"

"ఇటీజ్ వెరీ సింపుల్ డియర్. నేను నీ బాయ్‌ఫ్రెండ్‌ని, నువ్వు నా గర్ల్ ఫ్రెండువి. మనమిప్పుడు స్వర్గానికి షికారుకెళ్దాం!"

"నో.... నో... మిస్టర్ నాగరాజూ! ప్లీజ్ సిడౌన్." వలవంతంగా కూచోబెట్టింది.

"ఐ లవ్ ఇండియన్ కల్చర్. అమెరికాలో ఈ హోలీలాండ్ గురించి గొప్పగా చెప్పుకుంటారు. ఇక్కడి మనుషులకు కారెక్టర్ .... అదే శీలం.... పెట్టని అభరణం గదా... ప్లీజ్ కీపిటప్" బయటకు దారిచూపించింది కళ్ళతో.

నాగరాజు వెన్నుపూసలో సైరన్ మోగింది.

(అమృత్ కిరణ్ - 1-3-1995)



# ఉపాయం

భాగ్యనగర్లో పరుగు ప్రారంభించిన మారుతీ కారు భారత్ నగర్లో ప్రవేశించింది. ప్రఖ్యాత నవలా రచయిత భరత్‌కుమార్ ఇంటిముందు ఆగింది. ఠీవిగా, కార్లోంచి కాలుబయట పెట్టిన వారితో కరచాలనం చేసి సగౌరవంగా లోపలికి తీసికెళ్ళాడు భరత్‌కుమార్.

భరత్‌కుమార్ రచనలంటే పడిచస్తుంది యువలోకం. కాలేజీ పిల్లలు కాట్లాడుకుంటారు. అందుకే అతని నవలలు హాట్‌కేకుల్లా అమ్ముడౌతాయి. సినిమాలుగా వస్తున్నాయి.

అంతకు ముందే అతనికి హైద్రరాబాదు నుండి ఫోనొచ్చింది. అమెరికాలో అరొందల కోట్ల రూపాయలు అవలీలగా సంపాదించిన ఆంధ్రుడు అమరేశ్వర్‌కు హఠాత్తుగా తెలుగు సినిమా తియ్యాలనే ఆలోచన వచ్చిందనీ, ఆ సినిమాకు అరవైకోట్లు కేటాయించాలనీ ఇటీవలే మార్కెట్లో కొచ్చిన తన నవలే ఆ సినిమాకు కథనీ, ఆ నవల హక్కులు కొనేందుకు కారులో బయలుదేరాడనీ.

"మీ ఇల్లు బయటి నుండి పూరిల్లులా కన్పించినా లోపల రాజభవనంలాగుంది. మిస్టర్ భరత్!"

అమరేశ్వర్ అభినందనలకు భరత్‌కుమార్ ఛాతీ అరంగుళాలు పెరిగింది. ఆనందడోలిక లూగించింది.

"బయటినుండి బ్రహ్మాండంగా కనబడితే ఇన్‌కంటాక్సోళ్ళ కన్ను బడ్తుంది గదండీ!" వినయంతో ముడుచుకుపోయాడు.

"వెరీనైస్, మీరసలు అమెరికాలో పుట్టాల్సిన వారు. సరే.... ఇంతవరకూ ఎన్ని నవలలు ఏఏ పేర్లతో రాశారు? ఎంత సంపాదించారు?"

"నా పేరుతో ఆరు, నా భార్యపేరుతో ఐదు, మా పనిమనిషి పేరుతో నాల్గు... ఏ పేరుతో రాసినా నా శైలిలోని వాడి, వేడి పాఠకులకు బాగా తెలుసు. అవి చదవాలని యూనివర్శిటీ విద్యార్థులు ఎగబడుతుంటారండీ."

"ఒక్కో నవల కెంత గిట్టుబాటౌతుంది?"

"సీరియల్‌గా వేసుకున్న పత్రికవాళ్లో పాతికవేలు, బుక్‌గా పబ్లిక్ చేసిన పబ్లిషరో యభైవేలు, అ తర్వాత సినిమాకు కొనుకున్న నిర్మాతో ఆరేడు లక్షలు... పూలల్లో పెట్టిస్తున్నరు. అన్నీ సూపర్‌హిట్టే. కాని అన్ని నవలలూ ఒక ఎత్తూ. ఇప్పుడు మీరు కొనబోయే "శతకోటి పాపాలకు అనంతకోటి ఉపాయాలు" నవల ఒక ఎత్తండీ."

"దాన్ని నేను చదివాను. దాన్లో యువతరాని ఉద్రూతలూగించే సెక్స్ సన్నివేశాలు, కోటీశ్వరులు సైతం కొట్టుకుచచ్చే ఎత్తులూ, పన్నులు ఎగ్గొట్టే ఉపాయలు... చాల బాగా చూపించారు. ఇది మీకే సాధ్యమైంది. మిస్టర్ భరత్. అందుకే ఆ నవలా హక్కులు కొనేందుకొచ్చాను చెప్పండి ఎంతిమ్మంటారు? మొహమాటం వద్దు, బేరం ఉండొద్దు."

"ఒకే మాట. పది లక్షలు సార్!"

"సరే.... దాంట్లో వైటెంతా, బ్లాకెంతా?"

"పదివేలు వైటు. విగితాది బ్లాకు."

"వెరీగుడ్. ఇంత సంపాదించినా పైసా పన్నుగట్టని మీ ప్రావీణ్యతకు నా జోహార్లు."

"ఏదో.... మీలాంటి పెద్దల ఆశీస్సులు. ఇక ముందు గూడా కట్టదల్చుకోలేద్సార్!"

"సరే.... కాయితం తయారుచెయ్." తన వెంటొచ్చినాయన్ను ఆదేశించాడు అమరేశ్వర్.

పోర్టబుల్ టైప్ రైటర్ కటటకలాడింది. టైపైన కాయితం భరత్‌కుమార్ ముందుంచారు సంతకానికి, కళ్ళతో చదివి కంగారుగా అరిచాడతడు.

"ఆ...నో... మోసం...దగా...! యూ...యూ.... ఒళ్ళంతా చెమటలుపట్టేసింది. కాళ్లు వణుకుతున్నాయి.

"మీరు చెప్పిందంతా ఆడియో, విడియో కాసెట్లలో కెక్కింది. చూస్తారా?" అమరేశ్వర్ అన ఐడెంటిటీ కార్డు చూపించాడు.

అమరేశ్వర్ అసలు పేరు అంజనికుమార్. ఇన్‌కంటాక్స్ డిపార్ట్‌మెంటులో ఉన్నతోద్యోగి.

(అమృత్ కిరణ్ - 16-4-1996)



# పరీక్ష

వరంగల్ నుండి మీ అమ్మా, నేనూ పెళ్ళి చూపులకు డైరెక్ట్‌గా వస్తాం. నవ్వక్కడినుండి అటేరా. అమ్మాయిని మేము ఓ పెళ్ళిలో చూశాం. చక్కని చుక్క కడిగిన ముత్యం. ఎమ్మే చదివిందట. నీకున్నట్టే ఆమెకూ... తనకు నచ్చిన వారినే పెళ్ళాడాలనుందట. అమ్మాయి నీకు నచ్చి తీరుతుంది. నీ ఫోటో పంపించాం. ఆమెకు నువ్వు నచ్చితే అక్కడి కక్కడే తాంబూలాలు పుచ్చుకుందాం."

నాన్న ఉత్తరాన్నందుకుని సికిందరాబాద్‌లో బస్సెక్కి సిద్ధిపేటకొచ్చాడు శ్రీకాంత్. ఎవరో తరుముకొస్తున్నట్టు పరుగెత్తుకొచ్చి కనబడిన ఆటో ఎక్కేశాడు.

"శంకర్‌నగర్ పోనీ....!"

జెట్ విమానంలా దూసుకెళ్లింది ఆటో.

.... బస్సులో .... ఆ జవరాలెవరో...! బస్సెక్కగానే తన పక్కన కూచుంది..... చేసుకున్న పెళ్ళాంలా... బస్సుకదిలిందో లేదో జరిగి దగ్గరకొచ్చింది. తాను కిటికీ వైపు జరిగాడు. ఆమె గూడా జరిగింది. తననే చూస్తోంది.

పాలలో కుంకుమ కలిపిన దేహఛాయ. చెవులరింగుల తళుకులు చెక్కిళ్ళమీద మెరుస్తున్నాయి. బంగారు తీగల్లాంటి చేతి వేళ్ళను తన భుజమ్మీదానిస్తూ..

"మీ పేరేమిటో!" అడిగింది. దొండపండు పెదవిని మునిపళ్ళతో పిండేస్తూ. తన నరాల్లో సంచలనం తనపేరు చెప్పేశాడు నవ్వాలని ప్రయత్నిస్తూ.

"అలాగా... నాపేరు వరూధిని, మీపేరు ప్రవరాఖ్యుడనుకున్నాను సుమా!" గలగలా నవ్వుతూ మరింత జరిగింది.

భుజాలు రాసుకుంటున్నాయి. శ్రీశైలం జలపాతంలా తనలో ఏదో అలజడి. ఎడమచెవి రింగు తన కుడిచెంపకు చల్లగా తగిలింది. అరచెయ్యి పెదాల కానించి మరోసారి నవ్వింది.

పిల్లకాదు ..... పిడుగులాగుంది. ముక్కుపుల్ల మెరిసింది.

మీరు కొంచెం జరిగితే..! బలవంతాన నవ్వాడు. అరచేతులంతటి ఆవిడ కళ్ళు ఏనుగు చెవులంతైనై.

"హబ్బా... ఏమైందటా!" జబ్బ మీద గిల్లింది. ఏమంటే ... ఏమంటుందో... నాలుక కదల్లేదు. ఆటో అంబేద్కర్‌నగర్ దాటింది.

.... బస్సు ప్రజ్ఞాపూర్‌లో ఆగింది. టీ తాగి వచ్చేసరికి... కిటికీకి వీపు ఆనించి సీటుమీద కాళ్ళు బార్లాజాపి ధనుస్సులా కూచునుంది. జారిన పైటను పట్టించుకోవడం లేదు. గుండెలు కవ్విస్తున్నై.

ముందు సీటు యువకుడికేవో సైగలు చేస్తోంది. కవ్వింపు తనలో కలకలం రేపింది. నాలుక తడారి పోయింది. బస్సు కదిలింది.

"నేను కూచోవాలి...!" ఆ మాత్రం అనగలిగాడు. చటుక్కున తల ఎత్తింది. అదో రకంగా పెదాలాడించింది.

"కూచోవాలా.... సరే...!" మూతి మూడొంకర్లు తిరిగింది. వెంటనే లేచి సైగలందుకున్న యువకుని పక్కన చేరింది. బస్సు పరుగందుకుంది. వాళ్ళ ముచ్చట్లూ, పకపకలూ, వికవికలూ... అబ్బో... తన కళ్ళూ చెవులూ వాళ్ళ చుట్టే తిరిగినై...

"శంకర్‌నగరొచ్చింది సార్!" చెయ్యిజాపాడు ఆటోవాలా.

అమ్మా నాన్నలు అప్పటికే వచ్చేశారు. పెళ్ళిచూపులకు ముందు ... విదేశాల్లో పెళ్ళిల్లూ. దేశ రాజకీయాలూ ముచ్చట్లలో కరిగిపోయినై.

"అదో... అమ్మామొస్తుందిరా! మాలక్ష్మిలాగుంది. పేరు పల్లవి. శ్రీకాంత్ చెవిలో ఊదింది తల్లి.

గులాబీ రంగు చీర ఆకుపచ్చ పూవుల అంచు. అదే రంగు జాకెట్టు...

ఓహ్... బ్యూటీ ఫ్లవర్! అచ్చం దేవకన్యలాగుంది. నా కలల పాటకు పల్లవి... ఆమెనే,కదిలే ఆమని... మనసు ఊయలలూగింది.

రాయంచలా నడిచొచ్చి ఫలహారాలందించింది. శ్రీకాంత్ కళ్ళలోకి చిలిపిగా చూసింది. ముసి ముసి నవ్వులతో గిలిగింతలు పెట్టింది. అమ్మాయి తనకు నచ్చిందని అమ్మా నాన్నలకు చెప్పేశాడు. సైగలతో. అలవోకగా కూచుంది. వల్లవి అందాలన్నీ కుప్పబోసినట్టుంది.

"ఇంకేమైనా పరీక్షలున్నాయా?" లోపలినుండి వచ్చి అడిగిందో యువతి... పల్లవి పక్కన కూచుంటూ.

ఈమె... ఆమె వరూధిని.. ఇక్కడెందుకుందీ? వెంటనే అడిగేశాడు.

"మీరా వరూధిని గారూ!"

"ఔను. నేనే శ్రీకాంత్ గారూ! మీరు నాక్కాబోయే భర్త. ఫణిభూషణ్ గారు. బస్సులో సైగలందుకొన్న యువకుణ్ని పరిచయం చేస్తోంది.

"ఏమిటిదంతా?" లేవబోయాడు.

"కూచోండి శ్రీకాంత్ గారూ! మీరు నాకు బాగానచ్చారు." పల్లవి మాట వీణమీటినట్టుంది.

"పల్లవి. వరూధినులు అక్కా చెల్లెళ్ళ సంతానమండీ" ఫణిభూషణందుకున్నాడు. శ్రీకాంత్ బుద్ధిని పరీక్షించే బాధ్యత పల్లవి, వరూధిని కప్పగించింది. వరూధిని హైదరాబాదులోనే ఉంటుంది. బస్సులో మిమ్మల్ని పరీక్షించింది. మీకు ఫస్ట్ మార్క్ వేసింది.

అందరి మొహాలు మిట్ట మధ్యాహ్నం ప్రొద్దుతిరుగుడు పూవులా విచ్చుకున్నాయి.

"మా అమ్మాయి సాహసాన్ని మీరు మరోలా భావిందొద్దు బాబూ!" పల్లవి తండ్రి శ్రీకాంత్ చేతులు పట్టుకుని బతిమాలాడు.

"ఏదో చిన్నపిల్ల ...." తల్లి ఆరాటం.

"క్షమించండి శ్రీకాంత్ గారూ!" పల్లవి చేతులు జోడించింది. ఎంతటి ధన హీనుడినైన భర్తగా స్వీకరించగలను. గాని గుహహీనుడిని మాత్రం భరించలేను."

రోజులు మారాయి గదూ!" గుండెల నిండా నవ్వుకున్నాడు శ్రీకాంత్.

(అమృత్ కిరణ్ - 1-5-1995)



# దానికదే - దీనికిదే

మనిషన్నప్పుడు జబ్బులు, ఫ్యాక్టరీ అన్నప్పుడు ప్రమాదాలు... ష.రా. మామూలే. సాధ్యమైనన్ని జాగ్రత్తలు తీసుకున్నా గూడా సాధారణమైన జలుబో రొంపనో మనిషికి రాక తప్పవు. అలాగే చిన్న చిన్న ప్రమాదాలు ఫ్యాక్టరీలో జరక్కమానవు.

బాంబేలో ఎం.బి.ఏ. చదివొచ్చిన కొడుక్కు ఫ్యాక్టరీ బాధ్యత లప్పగించి కాలుమీద కాలేసుక్కూచున్న వెంకట్రామయ్య కవన్నీ తెలుసు. పైలా పచ్చీసులో తండ్రి నుండి బాధ్యతలు స్వీకరించిన నాగేందర్‌కైతే తనమీద తనకు బోలెడంత విశ్వాసముంది. దానిక్కారణం ... కనీసం కాలేజీ మొహంగూడా చూడని తండ్రి ఫ్యాక్టరీని స్థాపించి పకడ్బందిగా నడిపిస్తున్నప్పుడు అంతపెద్ద డిగ్రీ పుచ్చుకున్న తాను అంతకంటే పకడ్బందీగా నడపగలననే నమ్మకం. కాని పదవి నలంకరించిన పదిరోజుల్లోనే చెప్పాల్లేకుండా పలుగురాళ్లల్లో పరుగెత్తినంత పనవుద్దని కలలో గూడా ఊహించలేదు.

ఉదయం ఆఫీసు కర్చీలో కూచోగానే ఇంటర్‌లో క్లాస్‌మేటు ఇందిర మనోఫలకమ్మీద ప్రత్యక్షమైంది. చెక్కిన శిల్పం, చక్కని రూపం. సన్నని పెదాలు, నున్నని చెక్కిళ్లు... క్లాసులో తన పక్కనే కూచుండేది. ప్రాక్టికల్స్‌లో తనకెంతో సహాయపడేది. నిన్న సాయంత్రం ఫ్యాక్టరీ ముందు అలా కన్పించి ఇలా మాయమైంది. ఆ సుందరాంగి చిరునవ్వులు గిలిగింతలు పెడుతున్న సమయంలోనే ప్రమాదం జరిగింది.

సీనియర్ వర్కర్ కనకయ్య కాలు మిషన్లో చిక్కుకుపోయింది. అరుపులు, పెడబొబ్బలు వినబడగానే ఎలక్ట్రిక్ మెయిన్ స్విచ్ ఆఫ్ చేశారు. మిషన్లాగిపోయినై. కనకయ్య కాలు ముక్కలైంది. వర్కర్లంతా కలిసి చేతులమీద హాస్పిటల్‌కు చేర్చారు. కాలును మోకాలు వరకు తీసెయ్యక తప్పలేదు.

మధ్యాహ్నం వర్కర్లు కట్టకట్టుకుని చాంబర్లో కొచ్చారు. తోటి వర్కర్ రక్తం కళ్లల్లో కదలాడిందేమో ఆవేశంతో ఊగిపోతున్నారు.

"ఇంత ఘోరం జరిగినా మీకు చీమకుట్టినట్టైనా లేదా?" నిలదీశాడొకడు. అయినా తనక్కోపం రాలేదు.

"ఎందుకు లేదూ! హాస్పిటల్ ఖర్చులనీ ఫ్యాక్టరీయే భరిస్తుందని డాక్టర్‌కు ఫోన్‌లో చెప్పానుగదా!" సముదాయించ బోయాడు.

"అంటే ... ఒక్కఫోన్‌తో చేతులు దులుపేసుకోవడమేనా? కనకయ్య కాలు సగం నరికేశారు తెల్సా! పాపం! అన్నమోరామచంద్రా అంటూ అల్లాడిపోతున్నాడు." ముందుకొచ్చాడు యూనియన్ లీడర్ నారాయణ.

అప్టరాల్ ఓ వర్కర్‌కు అంతధైర్యమా! తనకు చిర్రెత్తింది. అజాగ్రత్తగా పంజేస్తే...కాలేమిటి, తల గూడా నరుక్కుపోతుంది."

"ఐతే అదంతా కనకయ్య తప్పేనా?" గుర్రుమన్నాడు. మొహం ఎర్రబడి కనుగుడ్లు ముందుకొచ్చినై.

"కాపోతే నాదా? కొంచెం మర్యాదనేర్చుకో!"

"మర్యాద మన్ననలు పాటించక పోవడానికి మేమేమన్నా ఫ్యాక్టరీ ఓనర్స్‌మా? ముందు మీరే..." నారాయణ మాటల్లో కవ్వింపు.

"కొంచె వెనకాముందాలోచించి మాట్లాడు!"

"మా జాగల మీరెంటే తెలుస్తది అవస్త..." ఇంకేదేదో అంటున్నాడు.

చదువురాని, పూటకులేని వీళ్ళే ఇంత రెచ్చిపోతుంటే తన పరువు ఎర్ర చెరువులో కలిసిపోదా! అరికాలు మంట నెత్తికెక్కింది.

అసహ్యం అందోళన మించు కొచ్చినై.

"యూ షటవ్ అండ్ గెటౌట్!" వింతగా గొంతు చించుకొచ్చింది. ఆశ్చర్యంగా చూశారంతా. నలుగురూ నాలుగు మాటలన్నారు. వెంటనే ధర్నా ప్రారంభమైంది.

యూనియన్ జిందాబాద్.

యాజమాన్యం డౌన్ డౌన్.

"దమన నీతి నశించాలి. కార్మికుడు కనకయ్యకు న్యాయం చెయ్యాలి." నినాదాలతో దిక్కులు పిక్కటిల్లినై.

ఇంకేం న్యాయం చెయ్యాలో అర్థంగాలేదు. చేతులు ముడుచుక్కూచోవడం చేతకాని తనం... నారాయణను సస్పెండ్ చేస్తున్నట్టు ప్రకటించి మెరుపులా బయటి కొచ్చాడు. కారును స్వయంగా డ్రైవ్ చేసుకుంటూ ఇల్లుచేరాడు.

అప్పటికే సంగతంతా తండ్రికి తెలిసిపోయింది. గడపలో కాలుపెట్టగానే ఎదురొచ్చి వివరాలడిగాడు. అంతా చెప్పేశాడు. తండ్రి తప్పక మెచ్చుకుంటడనుకున్నాడు. కాని... తండ్రి మొహం మంకెన పూవులాగైపోతుందనుకోలేదు.

ఎందుకైనా మంచిదని "ఏమైంది నాన్నా!" అడిగాడు కళ్లలోకి చూస్తూ నవ్వాలని ప్రయత్నించాడు.

"అయితే అగ్నిలో అజ్యం పోసొచ్చావన్నమాట". తలపట్టుకున్నాడు వెంకట్రామయ్య.

"కాదు నాన్నా!" తన సబ్జెక్ట్ నాలేజినంతా తండ్రి ముందుంచాలనుకున్నాడు. "అడ్మినిస్ట్రేషన్లో ఏ మాత్రం అలసత్వం కనబడినా వర్కర్సు చేతిలో ఉండరు. డిసిప్లిన్ కాపాడకపోతే ఫ్యాక్టరీ దివాలాదీస్తుంది." చెప్పుకు పోతుంటే ఆపు మని చేత్తో సైగచేశాడు తండ్రి. అసమ్మతినంతా అదుపులో ఉంచుకోకతప్పలేదు వెంకట్రామయ్యకు.

"ఈ సమయంలోనే మన విజ్ఞత నుపయోగించాలి నాగూ!"

"అందుకే నారాయణను ఉన్నపళంగా సస్పెండ్ చేసొచ్చాను నాన్నా!" నవ్వబోయాడు.

వెంకట్రామయ్యకు ఒంటినిండా ముళ్లుగుచ్చుకున్నట్లైంది. గొంతులో కాఠిన్యం చోటుచేసుకుంది.

"పుస్తక జ్ఞానాన్నంతా మస్తకములో దాచుకుని వాస్తవ పరిస్థితుల నెదిరించడములో చాకచక్యం ప్రదర్శించాలి నాగూ!"

"అదే .... అదే నాన్నా... అలాగనుకునే ఇలా చేశాను."

"ఒక్కటి గుర్తుంచుకో నాగూ! కార్మికుల చెమట బిందువులే - బిందువులాంటి మన సంపదలను సింధువులా పెంచాయి. వాళ్ల కాయకష్టాన్ని క్యాష్ చేసుకుని మనం కోటికి పడగెత్తాం..." సముదాయించబోయాడు.

నాగేందర్లో కాలనాగు బుసలుకొట్టింది.

"వాళ్లూరికే చెయ్యడం లేదుగదనాన్నా! జీతాలు బోనస్‌లు, రకరకాల అలవెన్సులు లాగేస్తున్నారు గదా!"

"మనం ఎన్ని ఇచ్చినా ఆత్మీయత అందివ్వని నాడు అంతా బూడిదలో పోసిన పన్నీరేరా...!"

ఇంకే మాట్లాడాలో అర్థంగాలేదు నాగేందర్‌కు.

"నువ్వు స్వయంగా రంగంలోకి దిగి కనకయ్యను కంపెనీ కారులో హాస్పిటల్‌కు చేర్చితే బాగుండేది.

నాగేందర్‌కా ధోరణి అసలే నచ్చలేదు.

"హుం! వానికి సేవలు చేస్తూ అక్కడే పడుంటే ఇంక బాగుండేదా?" గొంతులో వెటకారం సుడులు తిరిగింది.

"అవును. వెంటనే ఎక్స్‌గ్రెషియా ప్రకటిస్తే ఎక్స్‌లెంట్‌గా ఉండేది..."

"ప్యాక్టరీలో భాగమిస్తే ..."

"నాగూ! నేను చెప్పేది విను." సింహగర్జన.

"నాకంతా తెలుసు నాన్నా! మీరీ విషయంలో జోక్యం..."

చెంపచెళ్ళుమంది. నాగేందర్ బుర్ర గిర్రుమంది. ఎన్నడూ పల్లెత్తు మాట అనని నాన్న పళ్లూడేలా చెంప దెబ్బ కొట్టడమా! మెదడు పొరల నలుముకున్న ఆవేశం అదృశ్యమైంది. అమాంతం బాధ, వేదనలు పొంగుకొచ్చినై. ఎదురుగా అమ్మ కన్పించింది.

"అమ్మా.... చూడమ్మా.... నాన్న!" చిన్నపల్లాడిలా తల్లి ఒడిలో వాలిపోయాడు.

"బాధగా ఉందా బాబూ!" తల్లి పరమేశ్వరి తలనిమిరింది. పుత్రప్రేమను పొత్తి కడుపులో అదిమిపెట్టుకుని, "ఈ చెంపదెబ్బను నీ జీవితములో మరవొద్దు నాన్నా! కార్మికులు కార్ఖానాలకు పునాదిరాళ్ళు. వాళ్లను కాపాడుకోవడం మన బాధ్యత....." బుజ్జగించింది.

అప్పటికే నాగేందర్ కళ్లను నీటిపొరలు కమ్ముకున్నై.
"ఇప్పుడు నేనేం చెయ్యాలమ్మా?"

"వాళ్లు సమ్మెనోటీసు ఇవ్వకముందే జాగ్రత్త పడాలిబాబూ!" భుజాలు పట్టిలేపి పక్కన కూచోబెట్టుకుంది.

"సమ్మె చేస్తే మనం లాకౌట్ ప్రకటించవచ్చు గదమ్మా!"

"పిచ్చికన్నా! సమస్యను తెగేదాకా లాగొద్దు. లాకౌట్ అనేది ఫ్యాక్టరీ యాజమాన్యానికి లాకప్‌లాంటిది. కార్మిక రంగములో ఆశాంతి కర్మభూమికి చేటు. ప్రతిఫ్యాక్టరీలో ఇలాగే జరిగితే ఉత్పత్తి. పడిపోతుంది, దేశాభివృద్ధి కుంటుపడుతుందిరా! మీనాన్న చెప్పినట్టు చెయ్. తల నిమిరి భర్తవైపు తిరిగింది. "మన వాడికి పెళ్లీడొచ్చింది గదండీ!" పెదాల మీద చిరునవ్వు మెరిసింది.

టీ.వీ. లో హాస్య కార్యక్రమ మేదో ప్రసారమౌతోంది. దాని మానాన దాన్నొదిలేసి

"పెళ్ళి సంగతి సరేగాని ముందు మీరు నావెంట నడవండి." అదేశించాడు వెంకట్రామయ్య.

సరిగ్గా అదే సమయములో... అస్పత్రి - కార్మికులతో కిటకిటలాడ్తోంది. కనకయ్య మంచం వద్ద నలుగురైదుగురు కార్మిక నాయకులున్నారు. కనకయ్య కప్పుడే స్పృహవచ్చింది. తన కాలు సగంతీసేశారని తెలిసి బావురుమన్నాడు.

"ఏ జన్మల ఏపాపం జేసిన్నో గీజన్మల గీశిక్ష పడింది." అంటూ కన్నకూతురు చెతులందుకుని కుమిలి పోతున్నాడు.

కార్మిక నాయకుల గుండెలు గున గున లాడినై. యాజమాన్యం మీద కస్సుబుస్సులాడ్తున్న నారాయణ.

"శిక్ష నీ ఒక్కనిది కాదన్నా! మనందరిది. నువ్వు ధైర్యంగా ఉండు." మిగతా నాయకులవైపు చూచాడు-ఇప్పుడు మన కర్తవ్యమేమిటన్నట్టు.

"సమ్మె చేసైనా సరే న్యాయం జరిగేలా చూస్తాం". మరో నాయకుడన్నాడు. కాలువదపలేని కనకయ్య గుండె గోడలకు గుండుసూదులు గుచ్చుకున్నట్టుంది.

"మీరు కొంచెం ఆలోచించుండ్రి తొందర పడకుండ్రి." బతిమాలాడు.

ఆస్పత్రి సిబ్బంది అపినా ఆగుకుండా మరికొందరు కార్మికులు మంచం చుట్టూ మూగారు. కనకయ్య దీనస్థితి కంటతడి పెట్టించింది.

"ఇంకా ఆలోచించేదేముందటా! కార్మికుల మంతా కలిసికట్టుగా ఉంటే కాలనాగులాంటి యాజమాన్యం గూడా కాళ్లూ చేతులు ముడుచుకోవల్సిందే" ఊగిపోయా డో కార్మికుడు.

"ఔను వెంటనే సమ్మెనోటీసిద్దాం." కోరస్‌గా అన్నారు. "హర్తాలొద్దు" అంటున్న కనకయ్య నెవ్వరూ పట్టించుకోలేదు.

"పదండి డైరెక్ట్‌గా వెంకట్రామయ్య గారి వద్దకెళ్లి నోటీసు స్వయంగా అందిద్దాం..." నారాయణ పిలుపిచ్చాడు.

అప్పుడే లోపలి కొస్తున్న వెంకట్రామయ్య

"ఔను అన్యాయన్ని ప్రతిఘటించాల్సిందే!" అంటూ నారాయణ భుజమ్మీద చేయ్యేసి నీ సస్పెన్షన్ ఉత్తర్వులు బుట్టదాఖలైపోయినై బ్రదర్ !" ప్రకటించాడు.

కొడుకూ, భార్యను తీసుకుని కనకయ్య దగ్గరికెళ్లాడు. "ఎలాగుంది కనకయ్యా!" అంటూ పక్కన కూచున్నాడు.

"నన్ను మన్నించు కనకయ్యా!" నాగేందర్ చేతులు జోడించాడు. కారులో వచ్చేప్పుడు తండ్రి చెప్పిందంతా కలవర పెడుతోంది.

"అయ్యా... మీరొచ్చింంద్రా...." కనకయ్య లేవబోయాడు.

"వద్దు నాన్నా!. లేవొద్దు." పక్కనున్న కూతురు ఆపేసింది.

అరె... ఇందిర కనకయ్య కూతురా! నాగేందర్ చూపులు ఇందిర మీద నిలబడిపోయినై.

వెంకట్రామయ్యలో వేదన పెరిగింది. ప్రమాదం జరగ్గానే మావాడు సరిగా స్పందించలేదు. కుర్రాడు గదా! ఏమీ అనుకోవద్దు..." అంటూ ఆపిల్ ముక్క నోటికందించాడు.

ఆపదలో యజమాని ఆత్మీయత కనకయ్య ఎదను పొంగించింది.

"నాకిదొక్కతే కూతురు బాబూ! దీన్నీ లోకంలపడేసి వాళ్లమ్మ మరో లోకంలకు వోయిందయ్యా! దీన్ని బాగానే సదివించిన... కాని... పెండ్లి ఎట్లా చెయ్యాలే....!" కళ్లల్లో నీళ్లు తిరిగినై.

కొండమీది కోతికి కొబ్బెరిచిప్ప కనబడినట్టనిపించింది నాగేందర్‌కు. వంగి తండ్రి చెవిలో ఏదోచెప్పేశాడు.

"ఫాక్టరీ కుటుంబములో మనమంతా సభ్యులం కనకయ్యా! అని వెంకట్రామయ్య భార్య వైపు తిరిగాడు. "ఈ అమ్మాయి మనింటి కోడలైతే ఎట్లా ఉంటుంది?" అడిగాడు.

"మహాలక్ష్మి లక్ష్మణంగా మనింటికొచ్చినట్టు ఉంటుంది." అందావిడ మురిసిపోతూ." నువ్వేమంటావమ్మా!" అంటూ ఇందిరను దగ్గరకు లాక్కుని ఛెంపలు నిమిరింది.

ఇందిర చెంపలు సిగ్గుతో కెంపులైపోయినై. ముఖమో వెలుతురు పూవై సహస్రదళాలుగా విచ్చుకుంది. నాగేందర్ కళ్లల్లో కళ్లు కలిపింది.

"అమ్మదొంగా!" నాగేందర్ ముందుకు రాబోయి ఇందిర కళ్ళసైగల నందుకుని ఆగిపోయాడు.

"నిజమా...ఇదంతా నిజమా బాబు గారూ!" నకకయ్యాకు నమ్మశక్యం కాలేదు.

"నిజమే అన్నగారూ! మీరు ఊ ంటే వెంటనే ముహూర్తాలు పెట్టిద్దాం!" అంది పరమేశ్వరి.

"అన్నట్టూ... కట్నకాన్కల ప్రసక్తేమీలేదు. ఇదిగో ఎక్స్‌గ్రాషియా చెక్కు." నాగేందర్ కనకయ్య చేతికి చెక్కు అందించాడు.

"నా కూతురికి బంగారమసొంటి సంబంధం దొరికింది. ఇంక నాకు గిదెందుకూ?" అంటున్న కనకయ్య నరనరాన ఆనందోత్సాహం ప్రవహిస్తూంది.

"దానికదే - దీనికిదే." అంటూ నారాయణ నవ్వేశాడు. అతని చేతుల మీదుగా చెక్కు కనకయ్య తలగడ కిందికెళ్లిపోయింది.

కార్మికుల్లో ఆనందోత్సాహాలు ఉరకలేశాయి.

"ఆనందమానంద మాయేనే, మా ఇందిరమ్మ పెళ్లి కూతురాయేనే." పాడుతూ చిందులు తొక్కారు.

(ఆకాశవాణి - హైద్రాబాదు ప్రసారం 19-10-1998)



# శివరాత్రి చిద్విలాసం

"రేపు శివరాత్రి కదండీ!"

భర్త ఆఫీసు నుండి రాగానే వేడి వేడి కాఫీ అందిస్తూ కాటుక కళ్లను గమ్మత్తుగా తిప్పేసింది కామాక్షి.

"ఐతే ఏమిటటా!" ఒక చేత్తో కాఫీ కప్పందుకుంటూ మరో చేత్తో భార్య బుగ్గమీద చిటికేసి సోఫాలో సెటిలై పోయాడు కాంతారావు.

తియ్యని అనుభూతిలోంచి తేరుకుని "అబ్బే అది కాదండీ!" భర్త పక్కన కూచుంది.

"శివరాత్రినాడు ఉపవాసం చేస్తే కాశీలో గోవును దానం జేసినంత పూణ్యమట. రేపు మనం ఉపవాసం ఉందామండీ" లాలనగా భుజమ్మీద చెయ్యేసింది.

"అంటే .....!" ఐసై పోతున్నాడు కాంతారావు.

"రేపు మనం భోజనం మానేసి ఒక్కపూట టిఫిన్‌తో సరిపెట్టుకోవాలి.! ఆ తర్వాత రాత్రికి దైవస్మరణచేస్తూ జాగారం చెయ్యాలి."

గులాబ్‌జామ్ తింటూంటె గులకరాయి పంటికింది కొచ్చినట్టై కాంతారావుకు కంపరమెత్తింది.

"కొత్తగా పెళ్ళయిన వాళ్ళం గదా! ఇప్పట్నుంచే ఆ మహాయజ్ఞం మనకెందుకూ?"

"ఇప్పుడు కాకపోతే వయసుడిగి పళ్ళూడింతర్వాతనా? అప్పటిదాకా బతుకుతామనే గ్యారంటీ ఏమిటీ? బతికున్నప్పుడే బలుసాకంత పుణ్యం మూట గట్టుకోవాలిగదా."

అచార్య వ్యవహారాల గురించీ, ఉపవాసం వల్ల లాభాల గురించీ ఉపన్యాసం మొదలైంది.

ఉపన్యాసాలు వినడం కంటే ఉపవాసముండడమే మేలనిపించి తలూపేశాడు కాంతారావు.

రిక్షాలో జంటగా బజారుకెళ్ళారు.

కందగడ్డ, మూడు రకాల పండ్లు, సత్తుపిండి సామాగ్రి, పూజా సామాగ్రి కొనుక్కుని ఆటోలో తిరిగోచ్చేసరికి వందనోటుకు రెక్కలొచ్చి ఎగిరి పోయింది. ఆటో దిగుతూ...

"చూశావా, నువ్వంటే నాకెంతో ప్రేమో" అన్నట్టుగా నవ్వేశాడు.

కామాక్షి మురిసిపోయింది.

తెల్లవారింది. శివరాత్రి. ఆఫీసుకు సెలవు. ఉపవాస దీక్ష ప్రారంభమైంది.

పదయింది. కడుపులో చిట్టెలుకలు పరుగులు తీస్తున్నాయ్. తట్టుకోవడం అసాధ్యమైపోతోంది. కాంతారావుకు.

భర్యా భర్తల మధ్య ఇచ్చిపుచ్చుకునే ధోరణిలో చర్చ జరిగింది. ఉపవాసాల నిబంధనల్లో స్వల్పమైన సడలింపు జరిగింది. కాఫీ కడుపులోకి జారుకుంది.

మూతి తిప్పుళ్ళూ, మోచేతి పొతుపుల మధ్య శివపూజ కార్యక్రమం పూర్తయ్యేసరికి మధ్యాహ్నాం రెండైంది. ఆకలి కేకలు ఆకాశాన్నంటుతున్నై. రెండో దఫా చర్చా కార్యక్రమం ప్రారంభిద్దామన్నాడు కాంతారావు.

"నాలుగయ్యేదాకా మౌనవ్రతం పాటించాలి. అందాకా మీరు మాట్లాడితే నన్ను చంపుకు తిన్నంత ఒట్టు."

కామాక్షి పరమేశ్వరి అవతారమెత్తింది. శివలీలలు పుస్తకం భర్త చేతికిచ్చింది.

సాయంత్రం నాలుగైంది.

"ఆకలి కాగలేను. చలో కామాక్షీ!"

ఎండకువాడిన పండుటాకులా సోఫాలో వాలిపోయాడు.

ఐదింటికి పండ్లూ, కంద గడ్డలూ, సత్తుపిండీ.... ఆరగింపు జయప్రదంగా ముగిసింది.

"జాగరణ సరిగా చెయ్యకపోతే ఉపవాస దీక్షా ఫలితం దక్కదు.ఒక వీ.సి.పీ. మూడు భక్తి సినిమా క్యాసెట్లు పట్టుకురండి."

బజార్లో వీ.సీ.పీ. షార్టేజి. ఊరంతా గాలిస్తే వంద రూపాయల అద్దెకు దొరికింది. వీ.సీ.పి. లో సినిమా షురువైంది. వానాకాలం చెరువులోకి కప్పలా పక్కింటి జనాలు బిలబిల మంటూ వచ్చేశారు. వాళ్లందర్నీ సాదరంగా ఆహ్వానించి కూచోబెట్టింది కామాక్షి.

భూకైలాస్. దక్షయజ్ఞం, పార్వతీ కళ్యాణం సిన్మాలు ముగిసే సరికి ఉదయం నాలుగైంది.

తెల్లారే సరికి స్నానాదులు ముగిస్తే సరి. జాగరణ దిగ్విజయం. అనుకుంటూ లేచింది కామాక్షి.

అవులిస్తూ వెళ్లిపోయారు జనాలు.

"ఇహలేచి మొహం, స్నానాదులు, కానివ్వండి. మహానుభావా!"

సోఫాలో ఒరిగి కూచున్న భర్తపక్కన జేరి కళ్లలో కళ్ళు కలపబోయింది కామాక్షి.

గుర్ర్‌ర్.... గుర్ర్‌ర్ ... గురకలయబద్ధంగా వినిపిస్తోంది.

(అమృత్ కిరణ్ - 16-2-1995)

# పండుగ కట్నం

"రాత్రి ఎనిమిదైందండీ! మొదటిది చేదు పండుగట. కొత్తల్లుడు అత్తారింటికెళ్ళొద్దంటే వినకుండా లాక్కొచ్చారు..." వేడి టీ తాగుతూ వాడిచుపులతో దుమధుమ లాడింది మాధురి. ఫ్యాన్ గాలి ముంగురుల్ని చెక్కిళ్ళు మీదాడిస్తుంది. ట్యూబులైటు వెలుగు ముక్కుపుడకలో తళుక్కుమని నగేష్ కళ్లల్లో మెరిసింది. నగేష్ నరాల్లో గిలిగింతలు.

"చిరు కోపంతో నీ మొహం చందమామైందోయ్!" కప్పు టేబుల్ మీదుంచి పెదాలందుకో బోయాడు. ఎడమచేత్తో భర్త నడ్డుకుంటూ" ఇది పడగ్గది కాదు మహానుభావా! సిద్ధిపేటలో అమరావతి హోటల్ ప్రభూ!" సిగ్గులతో బుగ్గలు ఎర్రమందారాలైపోయినై.

కొత్తగా పెళ్ళైన జంట. తెల్లవారితే ఉగాది. పండగ కట్నం దండిగా దండుకోవాలని ఉవ్విళ్లూరుతున్నాడు నగేష్. బస్టాండ్‌లోనే టీ తాగాలన్పించింది.

"ఇది ఫ్యామిలీ రూం డియర్ ఎవ్వరూ లేరు. ఆ గులాబి బుగ్గ... అబ్బా... ప్లీజ్ మాధురీ!"

తనువెల్లా తమకం మాధురి కనురెప్పలు మత్తుగా వాలిపోతున్నై. ఏదో పారవశ్యం.

భార్యా, ఇద్దరు పిల్లల్తో అప్పుడే దిగాడు భగవంతం.

"ఛీ....పానకంలో పుడక.." గొణుకున్నాడు నగేష్.

"నగేష్! ఎప్పుడొచ్చారు బ్రదర్!" తోటల్లుడు సహారా ఎడారిలో చల్లని చెట్టు నీడలా కన్పించాడు భగవంతంకు.

"అక్కా! మీరుకూడా వచ్చారా!" మాలతిని పిలిచి పక్కన కూచోబెట్టుకుంది మాధురి. టేబుల్‌కో పక్క అక్కా చెల్లెళ్ళు, మరోపక్క తోటల్లుళ్ళు. పిల్లలు మరో పక్క కూచున్నారు.

"చెప్పు బ్రదర్! ఈ పండిక్కి మనకేం కట్నాలు వస్తాయంటావ్?" టీకి ఆర్డరిచ్చి అడిగాడు భగవంతం.

'మొదటిది చేదు పండగనే ఛాందసాన్ని ఛేదించి మరీ వచ్చేశామన్న గారూ! స్కూటర్ వసూలు చేస్తా!"

'నేనైతే మామగారు రావద్దని రాసినా, మీ వదిన వద్దని మొత్తుకున్నా ఖాతరు చెయ్యలేదు. పాతల్లుణ్ణి గదా! ఓ పోర్టబుల్ టీ.వి. వసూలు చేస్తా!"

ఇద్దరిలో పట్టుదల పోటీలు పడి పొంగిపొర్లింది. అక్కా చెల్లెళ్ళు వారి మాటల్లో పడిపోయారు.

"మన బామ్మర్దికి కమర్షియల్ టాక్స్‌లో ఉద్యోగం దొరికిందట గదా! సూర్యాపేటలో తెగ సంపాదిస్తున్నాడంట, మనం మాత్రం పరస్పరం మద్దతిచ్చుకోవాలి సుమా!" నగేష్ గల్లా ఎగిరి పడింది. వీడికి ఆలిండియా అల్లుళ్ళ సంఘాధ్యక్షుడయ్యే అర్హతలున్నాయి- అనుకున్నారు. భగవతం.

ఆటోల్లో బయల్దేరారు. పిల్లలు కొత్త జంట వెంటున్నారు.

"ఇంటికెళ్ళగానే మా తమ్మునికో సర్ప్రైజిచ్చి, భోంచేసి పడుకోవాలండీ!" అలసటగా భర్త మీదికొరిగింది మాలతి. బుగ్గ గిల్లాడు భగవంతం. దిగ్గున పక్కకు జరిగి వెక్కిరించింది. ""సిగ్గులేదు!" అన్నట్టుగా.

ప్రశాంతి నగర్లో... ఇంటి ముందాగాయి ఆటోలు. పాలకోవా పాకెట్ దొరికినట్టు కేరింతలు కొడుతూ దిగారు పిల్లలు, డబ్బులు పుచ్చుకొని వెళ్ళిపోయారు ఆటోలు. కాలనీ నిర్మానుష్యంగా ఉంది.

"బాబోయ్! అమ్మమ్మింటికి తాళవేసుంది" పాప బుంగమూతి పెట్టేసింది. అంతా చూశారటు. తాళం కప్ప వెక్కిరిస్తూంది. వీధిలైటు విరగబడి నవ్వుతూంది. తట్టగానే పక్కింటి తులుపులు విసురుగా తెరుచుకున్నాయి.

"మా అమ్మా వాళ్లేరండీ!" మర్యాదగా అడిగింది మాధురి.

"ఓహో! మీరు రామచంద్రాచారి కూతుళ్లా! మీ అమ్మా నాన్నలు మొన్ననే తీర్థయాత్రల కెళ్ళారు." ఆవులిస్తూ తలుపులు ధడేల్న మూసేసిందా ఇల్లాలు.

"అయ్యో! ఇప్పుడెట్లా!" నగేష్ అరుగు మీద కూచున్నాడు.

"మొండి అల్లుళ్లకు దండి కట్నం దొరికింది" మాలతి నెత్తికొట్టుకుంది.

"చేదు పండగ ... చేదు అనుభవం." మాధురి కిసుక్కుమంది.

(అమృత్ కిరణ్ - 1-8-1995)

